॥ శ్రీహరిః ॥

# ఆదర్శ భక్తులు


హిందీ మూలం
హనుమాన్‌ప్రసాద్ పోద్దార్

ఆంధ్రానువాదం
పురాణపండ సత్యనారాయణ, ఎమ్.ఏ.,
మరియు
పెదపూడి కుమారస్వామి,ఎమ్.ఏ., సాహిత్యరత్న

పరిష్కర్త - సంపాదకుడు
పందెపూడి రామచంద్రరావు, ఎమ్.ఏ.,



ప్రచురణ
గీతా ప్రెస్ గోరఖ్‌పూర్
1996

# మనవి

"భాగవతులగాథలు" పవిత్రములైనవి. అట్టి వారి గ్రంథశ్రేణిలో 'ఆదర్శ భక్తులు' ఒక చక్కని పుస్తకము. ఇందున్న కథలు భక్తిని, త్యాగమును, ఋజువర్తనాన్ని, సత్యసంధతను తెలియజేసే మహా మహులగాథలు. ఇవి ఆదర్శవంతములు, జ్ఞాన ప్రదాయకములు. ప్రయోజనకరములు, పురాణాంతర్గతములు. వీనిలో కొన్నింటిని సంశోధించి రచించుటలో సహకరించిన శ్రీభగవాన్‌దాస్‌జీ హోలనా గారికి ధన్యవాదములు.

ఈ పుస్తకపఠనముతో పాఠకులు ప్రయోజనము పొందగలరని ఆశింతును.

సంపాదకుడు.

# విషయ సూచిక



----oOo----

# 1. శిబిచక్రవర్తి

శ్లో. న త్వహం కామయే రాజ్యం, న స్వర్గం, నాపునర్భవమ్ ।
ప్రాణినాం దుఃఖతప్తానాం, కామయే దుఃఖనాశనమ్ ॥
(శిబి)

నేను రాజ్యమునుకోరను, స్వర్గమును కోరను. జన్మరాహిత్యమును కోరను. దుఃఖసంతప్త ప్రాణుల దుఃఖనాశనమే కోరెదను.

శిబిచక్రవర్తి ఉశీనరుని పుత్రుడు. విష్ణుభక్తుడు, పరమదయాళువు. శరణాగతవత్సలుడు. ఆయన యజ్ఞదీక్షలో ఉండగా ఒక పావురము భయముతో ఒణకుచూ వచ్చి ఆయన ఒడిలో వాలింది. అంతలోనే దానిని వెంటాడుతూ వున్న డేగవచ్చింది. అది మనుష్యభాషలో ఉదారపురుషుడైన రాజుతో ఇలాఅన్నది.

డేగ:– "రాజా! నీవు పృథ్వీలోని రాజులందరిలో పరమధార్మికుడవు. నేడు ధర్మవిరుద్ధకార్యాన్ని ఎలా తలపెట్టావు? ధనంతో కృతఘ్నతను, సత్యముచే అసత్యమును, క్షమతో క్రూరత్వాన్ని, సౌజన్యంతో దౌర్జన్యాన్ని జయించిన వాడివి. ఉపకారికి అందరూ ఉపకారం చేస్తారు. కాని నీవు అపకారికి కూడా ఉపకారివి. నీకు కీడుచేసిన వానికి

కూడా నీవు మేలుచేస్తావు. పాపులపై జాలిపడతావు. నీలో తప్పులెంచే వారిలో సైతం మంచినే గ్రహిస్తావు. అటువంటి వాడివి ఈ రోజు ఎందికిలా చేస్తున్నావు. నేను ఆకలికి తాళలేక పోతున్నాను, ఈ పావురంతో నాయొక్క ఆకలి తీర్చుకోవాలనుకున్నాను. ఈ పావురం కారణంగా నీవెందుకు ధర్మం తప్పుతావు?".

పావురం:– మహారాజా! నేను ఈ డేగకు భయపడి ప్రాణంకాపాడుతావని నీ శరణుకోరి వచ్చాను. నన్నీడేగకు ఏమాత్రమూ అప్పగించకు.

రాజు:– డేగతో, ఈ పావురం నీకు భయపడి ప్రాణరక్షణకై నన్ను ఆశ్రయించింది. ఇలా నా శరణుకోరిన పావురాన్ని నేనెలా విడిచిపెట్టగలను? శరణాగతుని రక్షించక, భయలోభ ద్వేషాలతో విడిచి పెట్టేవానికి, సజ్జనులను నిందించే వానికి బ్రహ్మహత్యాసదృశమైన పాపం చుట్టుకుంటుంది. మన ప్రాణాలమీద ప్రీతి మనకెలాగో ఇతరులకీ తమ ప్రాణాలమీద అంతే ప్రీతి. ప్రతి జీవికి మరణభయం సామాన్యమనే దృష్టితో ఇతరులను రక్షించాలి. నీకు ప్రాణమెంత ప్రీతో, ఇతరులకీ తమ ప్రాణాలపై అంతే ప్రీతి. ఆకలితో చావడానికి ఇష్టంలేక నీవు ప్రాణాలు కాపాడుకోవాలనుకుంటున్నట్లే, ఇతరుల ప్రాణాలనూ కాపాడాలి. ఓ డేగా! ప్రాణభీతితో తల్లడిల్లే యీ పావురాన్ని నీకు అప్పగించలేను. నీ ఆకలి తీరేమార్గం మరేదైనా వుంటే వెంటనే చెప్పు. అలా చేస్తాను.

డేగ:– మహారాజా! ఆహారంవల్లనే జీవులు పుడతాయి, పెరుగుతాయి, బ్రతుకుతాయి, ఆహారం లేకుండా బ్రతకడమసాధ్యం. ఆకలితో నేను మరణిస్తే నామీద ఆధారపడిన నా పిల్లపాపలు కూడా చనిపోతాయి. ఒక్క పావురాన్ని కాపాడటంకోసం ఎన్నో జీవులు ప్రాణాలు కోలుపోవలసివస్తుంది. ఓ పరంతపా! మరొకరికి ధర్మహానికలిగించే ధర్మం ధర్మంకాదు. అన్యధర్మానికి హాని కలిగించని ధర్మాన్నే, ఉత్తములు ధర్మం అంటారు. రెండు ధర్మాలకు వైరుధ్యం ఏర్పడినప్పుడు "బుద్ధి" అనే త్రాసుతోతూచి ఏధర్మం మహత్తరమో గ్రహించి దానినే ఆచరించాలి.

రాజు:- ఓ డేగా! భయాక్రాంత జీవులను రక్షించడానికిమించిన ధర్మం వేరేలేదు. దయార్ద్రుడై జీవులకు అభయమొసంగేవాడు మరణించినా, వాడి భయాలన్నీ తొలగిపోతాయి. కీర్తికోసమో, స్వర్గంకోసమో, గో, ధన, వస్త్రాలు దానంచేసేవారు ఎందరో ఉంటారు. కానీ సర్వజీవుల హితంకోరే పురుషులు దుర్లభులు, మహాయజ్ఞాల ఫలంకూడా కాలక్రమంలో క్షీణిస్తుంది. కాని భయవిహ్వాలమైన ప్రాణులకిచ్చిన అభయానికి ఎన్నడూ క్షయం లేదు. నేను నా రాజ్యాన్నైనా, శరీరాన్నయినా త్యజిస్తానుగాని దీనముగా, భయంతో గడగడలాడే యీ పావురాన్ని విడిచిపెట్టలేను.

శ్లో. యన్మమాస్తి శుభం కించిత్తేన జన్మని జన్మని ।
భవేయమహమార్తానాం, ప్రాణినామార్తినాశకః ॥

శ్లో. న త్వహం కామయే రాజ్యం న స్వర్గం నాపునర్భవమ్ ।
ప్రాణినాం దుఃఖతప్తానాం కామయే దుఃఖనాశనమ్ ॥

గతజన్మలో నేనే కొంచమైనా పుణ్యంచేసి ఉంటే తత్ఫలితంగా నేను దుఃఖంలో, కష్టంలో ఉన్న ప్రాణుల బాధను తొలగించగలిగితే చాలు. నేను రాజ్యమూ కోరను. స్వర్గమూ కోరను, మోక్షముకోరను, కేవలము దుఃఖసంతప్త ప్రాణుల దుఃఖం నశించడమే నేను కోరతాను. ఓ డేగా! నీ యీ ఉద్యమం కేవలం ఆహారంకోసమే కదా! నీవు ఆహారమే కోరుతున్నావు. నేను నీ దుఃఖనాశం కూడా కోరుతున్నాను. అందుచేత పావురానికి మారుగా నీకెంత ఆహారం కావాలో కోరుకో.

డేగ:- మాకు పావురమే శాస్త్రవిహితాహారం. అందుచేత మీరు దీనిని విడిచిపెట్టుడు.

రాజు:- ఓ డేగా! నేను శాస్త్రవిరుద్ధంగా మాట్లాడను. సత్యము, దయ పరమధర్మాలని శాస్త్రప్రమాణం. లేస్తూ, కూర్చుంటూ, నడుస్తూ, నిద్రిస్తూ, మేల్కొంటూచేసే ప్రాణి హితంకాని కార్యాలు పాశవిక కృత్యాలతో

సమానం. స్థావర జంగమాత్మకమైన సర్వప్రాణులను తనతో సమంగా భావించి కాపాడేవారికి పరమపదం కరతలామలకం. సమర్థుడై కూడా వధింప బడుతున్న ప్రాణులను పట్టించుకోనివాడికి ఘోరనరకం తప్పదు. సమస్త రాజ్యాన్నే కాదు, నీవు ఏది కోరినా ఇవ్వగలను, కాని ఈ పావురాన్ని మాత్రం ఇవ్వలేను.

డేగ:– రాజా! నీకీపావురము అంత ప్రియమైతే దానిని సరితూచి అంతే బరువున్న నీమాంసం నాకివ్వు చాలు.

రాజు:– డేగా! చాలా దయదలిచావు. నీకు కావలసినంత నా మాంసం ఇవ్వడానికి నేను సిద్ధమే. నశ్వరమూ, క్షణభంగురమైన శరీరాన్ని సమర్పించి శాశ్వత ధర్మాన్ని ఆచరించలేని వాడు హీనుడు. మూర్ఖుడు.

శ్లో. యది ప్రాణ్యుపకారాయ దేహోఽయం నోపయుజ్యతే ।
తతః కిముపకారోఽస్య ప్రత్యహం క్రియతే వృథా ॥

ప్రాణిమాత్రులకు నిష్ప్రయోజకమైన యీశరీరాన్ని అనునిత్యం పెంచి పోషించడం నిరర్థకం. ఓ డేగా! నీవు చెప్పినట్లే చేస్తాను.

ఇలాచెప్పి శిబిచక్రవర్తి త్రాసు తెప్పించి, ఒకపళ్లెంలో పావురాన్ని ఉంచి రెండో పళ్ళెంలో తన శరీరంనుంచి కోసిన మాంసాన్నివేస్తూ తూచసాగాడు. స్వసుఖాభిలాషమాని, అందరి సుఖమే తన సుఖంగా భావించే సజ్జనులే, పరుల దుఃఖంచూసి దుఃఖిస్తూ ఉంటారు. పావురాన్ని కాపాడాలి, డేగ ప్రాణాలూ కాపాడాలి. రెండింటి దుఃఖం తొలగిపోవాలి. అందుచేతనే శిబిచక్రవర్తి తన శరీరమాంసాన్ని స్వహస్తాలతో సంతోషంగా కోసియిస్తూ ఉన్నాడు. తన భక్తుని త్యాగాన్ని చాటుగా చూస్తూ భగవానుడు సంతోషిస్తున్నాడు. త్యాగమెంతగొప్ప ఆదర్శమో కదా!

త్రాసులోవున్న పావురం బరువు పెరిగిపోతూ ఉంది. రాజు మాంసం కోసి వేస్తూనే ఉన్నాడు. ఎంతకీ పావురమున్న పళ్ళెం

పైకిలేవలేదు. చివరికి రాజే స్వయంగా లేచి పళ్ళెంలో కూర్చున్నాడు. నిజమే కదా–

శ్లో. పరదుఃఖాతురా నిత్యం సర్వభూతహితే రతాః ।
నాపేక్షంతే మహాత్మానః స్వసుఖాని మహాన్త్యపి ॥

ఇతరుల దుఃఖంచూసి ఎల్లప్పుడు తల్లడిల్లేవారు, సర్వప్రాణుల హితమే నిరంతరం కాంక్షించేవారు మహాత్ములు. అటువంటి మహానుభావులు స్వసుఖం ఎంతగొప్పదిగానీ, దానిని తృణప్రాయంగానైనా లెక్కచెయ్యరు.

శిబిచక్రవర్తి త్రాసుయొక్క పళ్లెంలో కూచోవడంతో ఆకాశంలో దుందుభులు మ్రోగాయి. పూలవాన కురిసింది. అప్పటికిగాని చక్రవర్తికి మానవభాషలో మాట్లాడే ఈ పావురమూ, డేగా ఎవరా? అనీ, ఆకాశంలో వాద్యాలెందుకు మ్రోగుతున్నాయా? అనీ ఆలోచన రాలేదు. ఇంతలో డేగ, పావురం అంతర్ధానమయ్యాయి. వాటి స్థానాల్లో దేవతలు ప్రత్యక్షమయ్యారు. ఒకరు ఇంద్రుడు, మరొకరు అగ్ని. ఇంద్రుడు శిబిచక్రవర్తితో, "రాజా! నీకు జయమగుగాక! నేను ఇంద్రుడను, పావురంగా వచ్చినది యీ అగ్నిదేవుడు. మేము నిన్ను పరీక్షించడానికి వచ్చాము. నీవిప్పుడు చేసిన త్యాగం అపూర్వం. ఇంతవరకెవరు ఇలాంటి త్యాగము చెయ్యలేదు. ఈ లోకమంతా మోహమయమైన కర్మపాశంలో బంధించ బడివుంది. కాని లోకం దుఃఖం తొలగించడానికి నీవు కరుణాపాశానికి కట్టుబడ్డావు. నీవు అధికులను ద్వేషించవు. అల్పులను అవమానించవు. సరిసమానులతో వైరం పెట్టుకోవు. నీవు యీ లోకంలో సర్వశ్రేష్ఠుడవు. బ్రహ్మదేవుడు నీటితో నిండిన మేఘాలనూ, పళ్ళతో బరువైన వృక్షాలనూ, పరోపకారార్థమే సృజించాడు. తన ప్రాణాలను త్యజించైనా అన్యుల ప్రాణాలను రక్షించేవాడు పునర్జన్మలేని పరమధామము చేరుకుంటాడు. తమ పొట్టతాము నింపుకోవడం కోసమే పశువులు బ్రతుకుతాయి. కాని పరులకోసం బ్రతికేవాడి జీవితమే నిజమైన జీవితం. చందనవృక్షము తననుతాను చల్లబరచ కొనుటకు ఉత్పన్నము కాలేదు గదా? నీలా

స్వలాభాపేక్షలేని వారూ, పరోపకారైక పరాయణచిత్తులూ, లోకకళ్యాణం కోసమే భూమిమీద జన్మిస్తారు. నీవు దివ్యరూప ధారివై ఈ పృథ్వీరాజ్యాన్ని చిరకాలం పరిపాలించు. అనంతరం బ్రహ్మలోకం చేరుకుంటావు", అనిచెప్పి దేవతలిద్దరు అంతర్ధానమయ్యారు. శిబిచక్రవర్తి యజ్ఞం పూర్తిచేసి, చాలాకాలం రాజ్యం పాలించి చివరకి దుర్లభమైన పరమపదం పొందాడు.

-----oOo-----

# 2. రంతిదేవ మహారాజు

శ్లో. న కామయేఽహం గతిమీశ్వరాత్పరామష్టర్ద్ధియుక్తామపునర్భవం వా ।
ఆర్తిం ప్రపద్యేఽఖిలదేహభాజామంతః స్థితో యేన భవంత్యదుఃఖాః ॥

భారతవర్షం పురుషరత్నాలకు గని. ఏ విషయం తీసుకున్నా దానికి సంబంధించిన అత్యున్నతమైన ఉదాహరణలు ఈ దేశ చరిత్రలో లభిస్తాయి. 'సంకృతి' అనే రాజుండేవాడు. ఆయనకు ఇద్దరు పుత్రులు ఒకని పేరు గురువు, రెండవవాని పేరు రంతిదేవుడు.

రంతిదేవుడు మహాపరాక్రమవంతుడు. ఆయన న్యాయశీలిగా, దయాళువుగా, ధర్మపరాయణుడుగా, త్యాగిగా మూడులోకాలలోనూ ఖ్యాతి గడించాడు. రంతిదేవుడు నిరుపేదల బాధలుచూసి వారికి తన సర్వస్వం దానం చేసేశాడు. తర్వాత ఆయనకే జీవయాత్ర నడవడం కనాకష్టం అయింది. అయినా తాను పస్తులుంటూ దొరికిన దానిని పేదలకు పంచిపెట్టేవాడు. ఇలా పేదరికంపాలై ఆయన కుటుంబాన్ని ఎంతో కష్టంతో గడుపుతూ వచ్చాడు.

ఒకసారి నలభైఎనిమిది రోజులవరకూ ఆయనకు భోజనం కాదుగదా, త్రాగడానికి నీరుకూడా దొరకలేదు. ఆకలి దప్పులతో కృశించిన ఆయన

శరీరం ఒణకిపోతోంది. నలభైతొమ్మిదో రోజున ఆయనకు నేతితో కూడిన పరమాన్నమూ, నీరూ లభించాయి. నలభైయెనిమిది రోజుల పాటు పస్తులుండటంవల్ల, ఆయనా, ఆయనకుటుంబసభ్యులూ చిక్కి శల్యాలయ్యారు. వారి శరీరాలు ఒణికిపోతున్నాయి. ఆకలిగొన్నవాడికే ఆహారం విలువ తెలుస్తుంది. కళ్ళముందెప్పుడూ పంచభక్ష్య పరమాన్నాలుండే వారికి పేదల కడుపుమంట యెలాతెలుస్తుంది?

రంతిదేవుడిక భోజనానికి ఉపక్రమించగానే ఒక బ్రాహ్మణుడు అతిథిగా వచ్చాడు. కోట్లాది ఆస్తిపరుడు కీర్తికోసం ఒక లక్షరూపాయలు దానం చెయ్యడం విశేషంగాదు. కాని తాను ఆకలితో వుండి కూడా అన్నం దానం చెయ్యడం చాలకష్టం. అయితే అందరిలోనూ అంతర్యామిగా ఉన్న శ్రీహరిని దర్శించే రంతిదేవుడు శ్రద్ధతో ఆ అన్నమును అతిథిదేవునికి పంచాడు. బ్రాహ్మణుడు తృప్తిగా భోజనం చేసి వెళ్ళాడు.

రంతిదేవుడు మిగిలిన అన్నమును తానూ, కుటుంబమూ సర్దుకు తిందామనుకుంటుండగా ఒక శూద్రుడు అతిథిగా విచ్చేశాడు. శ్రీహరిని స్మరించుతూ మిగిలిన అన్నాన్ని రంతిదేవుడు ఆ దరిద్రనారాయణుడికి సాదరంగా పంచిపెట్టాడు. ఇంతలో కొన్నికుక్కలను వెంటబెట్టుకొని మరియొకడు అతిథిగా వచ్చి, "రాజా! యీ కుక్కలూ, నేను ఆకలిగా ఉన్నాము. భోజనంపెట్టండి" అని అడిగాడు.

హరి భక్తుడైన రంతిదేవుడు అతణ్ణి, సత్కరించి, మిగిలిన అన్నం మొత్తం ఎంతో ఆదరంతో అతిథిదేవునికి, అతని కుక్కలకి సమర్పించి నమస్కరించాడు.

ఇప్పుడు రంతిదేవుడి దగ్గర మిగిలింది నీరే. అదీ ఒక్కని దప్పిక తీర్చడానికి మాత్రమే సరిపోతుంది. రంతిదేవుడు ఆనీళ్లు త్రాగుదామనుకుంటుండగా ఒక చండాలుడు వచ్చి దీన స్వరంతో "ప్రభూ! నేను చాలా డస్సిపోయాను. అపవిత్రుడనక యీ నీచుడికి గ్రుక్కెడు నీళ్ళు ఇప్పించండి" అని ప్రాధేయపడ్డాడు.

అతడి దీనవచనాలు విని అతడు డస్సిపోయాడని గ్రహించిన రంతిదేవుడికి మిక్కిలి జాలికలిగింది. ఆయన తన అమృతవాక్యాలతో 'నేను అణిమాద్యష్ట సిద్ధులతోకూడిన ఉత్తమ పదవిని గాని, ముక్తినిగాని కావాలని భగవంతుడిని కొరను. సర్వప్రాణుల అంతఃకరణంలో నేనేవుండి వారి దుఃఖం తొలగిపోయేలా, నేనే వారి దుఃఖాన్ని అనుభవించాలని మాత్రం కోరుకుంటాను' అన్నాడు.

"దప్పికతో యీతని ప్రాణంపోతుంది. ప్రాణాలు, నిలబెట్టుకునేందుకు దీనుడై నన్ను నీళ్ళిమ్మని కోరుకున్నాడు. ఇతనికి నీళ్ళు ఇవ్వడం ద్వారా నా ఆకలి, దప్పిక, అలసట, ఒణకు, దైన్యం, నీరసం, శోకం, విషాదం సర్వం తొలగిపోతాయి" అని సహజ దయాళువైన రంతిదేవుడు తాను దప్పికతో మృతప్రాయుడవుతూ కూడా ఆ చండాలుడికి సంతోషంగా సాదరంగా నీళ్ళు ఇచ్చేశాడు. అహా! ఇవిగదా భక్తుడి లక్షణాలు!.

ఫలాపేక్షులైన వారికి వరాలిచ్చే త్రిలోకేశ్వరులైన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు మాయద్వారా బ్రాహ్మణాది రూపాలు ధరించి రంతిదేవుడిని పరీక్షించడానికి వచ్చారు. రంతిదేవుడి స్థైర్యం, భక్తి చూసి మిక్కిలి ప్రసన్నులై వారు తమ నిజరూపాలతో సాక్షాత్కరించారు. ఒక్కసారే ప్రత్యక్షమైన ఆ త్రిమూర్తులకు రంతిదేవుడు ప్రణమిల్లాడు. వారు కోరుకొమ్మన్నా రంతిదేవుడు ఏ వరమూ కోరలేదు. కోరుకోవడానికి ఆయనలో ఏదైనా ఆసక్తిగాని, కోరికగాని మిగలివుంటే గదా! ఆయన మనస్సు కేవలం వాసుదేవునియందే పూర్తిగాలగ్నమై పోయింది. అనన్యభగవద్భక్తుడైన రంతిదేవుని చిత్తం పరమేశ్వరునిలో లగ్నమై పరమాత్మలో తాదాత్మ్యం చెందింది. త్రిగుణాత్మకమైన మాయ ఆయన నుంచి, స్వప్నసదృశంగా అదృశ్యమైపోయింది. రంతిదేవుడి కుటుంబసభ్యులంతా ఆయన సాంగత్యప్రభావంవల్ల నారాయణభక్తి పరాయణులై యోగిజనులు పొందే పరమగతిని పొందిరి.

----oOo----

# 3. అంబరీష సార్వభౌముడు

దరిద్రుడికి భోగభాగ్యాలు అలభ్యం. వాడు వైరాగ్యంతో భగవద్భక్తిలో తగుల్కోవడం సహజమే. కాని దేవతలకే దుర్లభమైన విలాసభోగాలు, కనుసన్నలతో పొందగలిగినవాడు, నిష్కంటకమైన సర్వం సహాచక్రవర్తిత్వం గలవాడు. అపారమైన ఐశ్వర్యసంపన్నుడు, పరమవైభవోపేతుడు అయిన సార్వభౌముడు సమస్తభోగవస్తు జాలాన్ని తుచ్ఛంగా హేయంగా భావించి, ఆనందధాముడైన భగవంతుడి భక్తిలో లగ్నచిత్తుడు కావడం అత్యంత అసాధారణం. ఒకపాటి సంపద, అధికారమే మానవుని కళ్లకు పొరలు కప్పేస్తాయి. కామినీ, కాంచనాలు, అధికారమూ చాలా మత్తెక్కిస్తాయి. ఎంతగొప్ప పండితులైనా వీటి మత్తులోబడి సర్వనాశన మవుతారు.

శ్లో. శ్రీమద భక్ర న కీన్హ కేహి ప్రభుతా బధిర న కాహి ।
మృగలోచని కే నైన సర కో అస లాగ న జాహి ॥
(గోస్వామి తులసీదాస్ జీ)

(ధనమదంతో ధర్మంతప్పనివాడు, అధికారమదంతో చెవికెక్కని వాడు, మదవతిచూపులకు మోహవివశుడుకానివాడు ఎక్కడా కానరాడు అని గోస్వామి తులసీదాసు సూక్తి రత్నం.)

అయితే దీనబంధువైన భగవంతుని శరణాగతులలో, కడపంక్తిలో వున్న వారైనా అదృష్టశాలురు. భగవదనుగ్రహంవల్ల వారికి మోహాలుకలగవు. వారు నీటిలో తామరపువ్వులా లోకంలో వ్యవహరిస్తూనే సర్వదా నిర్లిప్తులుగా ఉంటారు. అటువంటి పరమ భాగ్యశాలురైన భక్తశ్రేష్ఠులలో అంబరీషుడొకడు. ఆయన పవిత్రచరిత్రుడు. నాభాగుని సుపుత్రుడు. వైవస్వతమనువు పౌత్రుడు. సువిశాల సామ్రాజ్యానికి అధీశ్వరుడు.

శ్రీమద్భాగవతం (9–4–15) లో ఇలావుంది–

శ్లో. అంబరీషో మహాభాగః సప్తద్వీపవతీం మహీమ్ ।
అవ్యయాం చ శ్రియం లబ్ధ్వా విభవం చాతులం భువి ॥

ఏడుద్వీపాల పృథ్వీ రాజ్యము, అశేషసంపదా, అంతులేని ఐశ్వర్యం వున్నా అంబరీషుడు, సమస్తమైన ఐశ్వర్యం స్వప్నంలో కన్పించే వస్తువుల వంటిదనీ, ధనసంపత్తివల్ల మానవుడు మదమోహాలకులోనైతే అతని బుద్ధి నశిస్తుందనీ తెలిసిన వివేకసంపన్నుడు. వాస్తవానికి వాసుదేవుని భక్తులైన సజ్జనులకు సర్వజగత్తూ 'లోష్ఠవత్స్మృతం' మట్టిబెడ్డలా అత్యల్పంగా భాసిస్తుంది. అంబరీషునికి అలాగే దృఢంగా అనిపించడంవల్ల ఆయన తన యావజ్జీవితాన్ని పరమాత్ముని పవిత్రచరణాలకు సమర్పించివేశాడు. మనస్సుతో సహా ఆయన సమస్త ఇంద్రియాలు రేయింబవళ్ళు భగవత్సేవాతత్పరంగా ఉండేవి.

శ్రీమద్భాగవతంలో ఇలా చెప్పబడింది–

స వై మనః కృష్ణపదారవిందయో –
ర్వచాంసి వైకుంఠగుణానువర్ణనే ।
కరౌ హరేర్మందిరమార్జనాదిషు
శ్రుతిం చకారాచ్యుతసత్కథోదయే ॥
ముకుందలింగాలయదర్శనే దృశౌ

తద్భృత్యగాత్రస్పర్శేంగ సంగమమ్ ।
ఘ్రాణం చ తత్పాదసరోజసౌరభే
శ్రీమత్తులస్యా రసనాం తదర్పితే ॥
పాదౌ హరేః క్షేత్రపదానుసర్పణే
శిరో హృషీకేశపదాభివందనే ।
కామం చ దాస్యే న తు కామకామ్యయా
యథోత్తమశ్లోకజనాశ్రయా రతిః ॥
ఏవం సదా కర్మకలాపమాత్మనః
పరేఽధియజ్ఞే భగవత్యధోక్షజే ।
సర్వాత్మభావం విదధన్మహీమిమాం
తన్నిష్ఠవిప్రాభిహితః శశాస హ ॥
(5–4–18–21)

(అంబరీషసార్వభౌముడు) తన మనస్సును శ్రీకృష్ణచరణకమలాల యందూ, తన వాక్కును కృష్ణుని గుణ సంకీర్తనంలోనూ, చేతులను శ్రీకృష్ణమందిరాన్ని శుభ్రంచేయడంలోనూ, చెవులను అచ్యుతుని పవిత్రకథలను ఆలకించడంలోనూ నిమగ్నం చేశాడు.

తన కన్నులను భగవంతుని మూర్తిని దర్శించడానికి, తన అవయవాలను భగవత్సేవకుల శరీరాన్ని స్పృశించడానికి, తననాసికను శ్రీహరి చరణకమలాలకు సమర్పితమైన శ్రీతులసీ సుగంధాన్ని ఆఘ్రాణించడానికి, తన నాలుకను శ్రీహరి ప్రసాద రసాస్వాదనకూ అంకితం చేశాడు.

తన పాదాలను శ్రీహరి పవిత్రక్షేత్రాల్లో తిరగడానికి, తన శిరస్సును శ్రీహృషీకేశుని చరణాలకు నమస్కరించడానికి నియోగించాడు. లంపటులవలె ఆయన విషయాలకు లిప్తుడుకాలేదు. తాను అనుభవించేదంతా శ్రీహరి ప్రసాదంగా భావించాడు. భగవద్భక్తులయందు ప్రీతినిమిత్తంగా తనకు సమకూడిన భోగపదార్థాలను ముందుగా భక్తులకు సమర్పించి తరువాత తాను స్వీకరించేవాడు.

తన సమస్తకర్మలనూ యజ్ఞపురుషుడు, పరమాత్మ, అధోక్షజుడయిన శ్రీకృష్ణునికి సమర్పించి ఎల్లరి ఆత్మ భగవంతుడనే భావంతో అంబరీషమహారాజు భగవత్పరాయణులైన బ్రాహ్మణులు చెప్పినట్లు శాస్త్రనియమానుసారం రాజ్యపాలన చేసేవాడు.

ఎంత ఉదాత్తజీవితం? ఇలా పరమాత్మునికే తన సర్వకర్మలనూ సమర్పించి జీవితం గడిపే వారికోసమే భగవంతుడు అవతరించి అనేక విధములైన లీలలు ప్రదర్శించ వలసివస్తుంది.

అంబరీషుడు నిష్కామభావంతో అనేక వేదవిహితయజ్ఞాలు ఆచరించి బహువిధ దానాలతో సర్వవ్యాపకుడైన పరమాత్ముని సేవించి సకలవిధ భ్రాంతులనుంచి విముక్తుడై దివారాత్రాలు భగవత్ప్రేమలో తాదాత్మ్యం చెందుతూ ఉన్నాడు. అయనకు స్వర్గసుఖాలు తుచ్ఛంగా భాసిస్తున్నాయి. ఎవరి విశుద్ధహృదయపీఠంమీద శ్రీకృష్ణభగవానుడు విరాజిల్లుతూ అలౌకిక ఆనందాన్ని అనుగ్రహిస్తుంటాడో ఆ భక్తులకు సమస్త భోగాలు తుచ్ఛంగా భాసిస్తాయి.

శ్రీహరి ప్రేమామృత రసాస్వాదనతో మైమరిచి అమరులైన వారిని విషయవాసనల మోహం ఎన్నడూ చలింపజేయలేదు. అంబరీషుడు భగవత్ప్రేమ సుధారసపానంతో గో, గజ, రథ, అశ్వములు, గృహము, భార్య, పుత్ర, మిత్రాదులూ, వస్త్ర, రత్న విభూషణాలూ, శస్త్రాస్త్రాలూ, అశేషధన భాండాగారాలు మొదలయినవన్నీ తుచ్ఛమూ, మిధ్యా అని భావించి భగవద్భక్తి నిరతుడయ్యాడు.

అంబరీష మహారాజేగాక ఆయన వశవర్తులైన సకల పరివార పరిచారకులూ పురజనులూ కూడా దేవతలకే ప్రలోభకరమైన స్వర్గ సుఖాలయందు కోర్కెమాని శ్రీహరి పవిత్రచరిత్రను ఆలకించడంలోనూ, ఆలపించడంలోనూ మనస్సులు లగ్నం చేశారు.

ఇలా అంబరీషుడు తన పాలిత ప్రజాసమూహంతో సహా

భగవంతుని ఆశ్రయించగానే భగవంతునికి కూడా ఆయన యోగక్షేమాలు వహించవలసి వచ్చింది. నిజమేగదా! మానవుడు తనచింతల సమస్త భారాన్ని చింతానివారణుడూ సమర్థచింతామణి అయిన భగవంతుని చరణకమలాలవద్ద విడిచి నిశ్చింతుడైతే, భగవంతుడపుడు 'మాశుచః'– చింతించకు, నీ సర్వభారాలను నేను వహిస్తాను, అని అభయమివ్వడం తథ్యం. అలా అభయం పొందడానికి ఎంతో సాధన కావాలి. దుష్టాత్ముల గర్వమును తొలగింపజేసే సుదర్శన చక్రాన్ని భక్తుని రక్షణార్థం భగవంతుడు నియోగించాడు. సుదర్శనం భగవంతుని ఆజ్ఞానుసారం రాజద్వారం వద్ద కావలికాస్తోంది.

(2)

అంబరీష సార్వభౌముని ధర్మపత్ని పతివ్రతాశిరోమణి. భర్తలాగే భగవద్భక్తురాలు. ఒకసారి అంబరీషుడు సతీ సమేతంగా శ్రీకృష్ణుని ప్రీతికోసం ఏకాదశీవ్రతం సంవత్సరం పాటు ఆచరించాడు. సంవత్సరం గడిచింది. శాస్త్రవిహితంగా దైవపూజ చేశాడు. వస్త్రభూషణాలంకృతమైన ఎన్నో ధేనువులను దానంచేశాడు. బ్రాహ్మణులు మృష్టాన్నభోజనాలతో సంతుష్టులయ్యారు. ఇక రాజు పారణ చేయవలసి ఉంది. సరిగ్గా ఆ సమయంలో శిష్యసమేతంగా 'దుర్వాసమహర్షి' వచ్చాడు. అతిథి సత్కారములను తెలిసిన అంబరీషుడు దుర్వాసమహర్షిని సత్కరించి భోజనం చేయమని ప్రార్థించాడు. మహర్షి సమ్మతించి మాధ్యాహ్నికక్రియలు ఆచరించడానికి యమునా తీరానికి వెళ్ళాడు. ద్వాదశి గడిచిపోవడానికి ఇంకా ఒక ఘడియమాత్రమే ఉంది. ద్వాదశి ఘడియలలో పారణ చేయకపోతే వ్రతభంగం అవుతుంది. అంబరీషునికి ధర్మసంకటం వచ్చి పడింది. బ్రాహ్మణానుమతంగా శ్రీహరి చరణోదకాన్ని స్వీకరించి దుర్వాస మహర్షికోసం ఎదురుచూస్తూ ఉన్నాడు. దుర్వాసుడు నిత్యక్రియలాచరించి రాజధానికి విచ్చేశాడు. రాజు పారణ చేశాడని తన తపోబలంతో గ్రహించి, క్రోధావేశంతో తనముందు అపరాధిలా చేతులు కట్టుకొని నిలబడిన అంబరీషునితో "ఓహో! ధనమదాంధుడైన ఈ రాజాధముడు ధర్మద్రోహియై చేసిన యీ అవినయం కారణంగా ఇతడు విష్ణుభక్తుడు కాడు. ఇతడు తానే

దేవుడనుకుంటున్నాడు. నన్ను భోజనానికి అతిథిగా ఆహ్వానించి నాకు భోజనం పెట్టకుండా ముందుగా తాను భోజనంచేశాడు. ఇతని ఈ అవినయానికి ఇప్పుడే ప్రతిక్రియ చేస్తాను" అని తలనుంచి ఒక జడను లాగి గట్టిగా నేలకేసికొట్టాడు. ఆ జటనుంచి వెంటనే కాలాగ్ని వంటి 'కృత్య' అనే భయంకరరాక్షసి ప్రత్యక్షమయింది. అది చేతిలో కరవాలంతో భూమి దద్దరిల్లేలా అడుగులు వేస్తూ రాజుమీదికి ఉరికింది. అయినా అంబరీషుడు వెనకడుగు వేయకుండా ఎక్కడున్న వాడక్కడే నిర్భయంగా నిలబడ్డాడు. సమస్తజగత్తులోనూ పరమాత్మ వ్యాపించి ఉన్నాడని గ్రహించినవారు ఎవరికి భయపడాలి? ఎందుకు భయపడాలి? అంబరీషుడు ఎంతటి భయానక ఘోరరూపంలోనైనా మురళీమోహనుని రూపమాధుర్యాన్నే తిలకిస్తాడు. దానిని ప్రాణపుష్పాలతో అంజలిఘటించి నిరంతరం పూజించడానికి సన్నద్ధుడుగా వుంటాడు.

తుమ్హారె బినా నహీ కుఛ భీ జబ
తబ ఫిర మై కిసలియే డరూం?
మరణ–సాజ సజ యది ఆఓ తో
చరణ పకడ సానంద మరూం ॥

అంబరిషుడదే ధోరణిలో ఉన్నాడు. కాని తన భక్తుని రక్షణార్థం భగవంతునిచే ముందే నియుక్తమైన సుదర్శనం తక్షణం కృత్యను ప్రచండదావానలం కుపిత సర్పాన్ని కాల్చివేసే విధంగా భస్మం చేసేసింది. అయినా అంతటితో సుదర్శనం శాంతించలేదు. భక్తద్రోహి దుర్వాసుని అంతుచూడడానికి పూనుకుంది. తానొకటితలిస్తే దైవమొకటి తలచినట్లయింది దుర్వాసునిస్థితి. భయంతో అతడు ప్రాణాలు అరచేత బట్టుకొని పరుగెత్తాడు. పదిదిక్కులూ, పద్నాలుగు లోకాలూ తిరిగాడు. భూమండలమంతా తిరిగాడు. పాతాళానికి వెళ్ళాడు. సముద్రాలు ఆకాశం గాలించాడు. దేవతల దగ్గరకు వెళ్ళాడు. దిక్పాలుర వద్దకు వెళ్ళాడు. దేవేంద్రునీ, బ్రహ్మనీ, శివుడినీ చూశాడు. కాని ఎక్కడా క్షణం నిలవడం కుదరలేదు. ఎవరూ అతనికి ఆశ్రయంకాని, అభయముకాని ఇవ్వలేదు. పరుగెత్తి పరుగెత్తి దుర్వాసుడు వేసారిపోతున్నాడు. పరిస్థితి గ్రహించి

శివుడు వైకుంఠం వెళ్ళి శ్రీమహావిష్ణువు శరణు వేడమని మునికి సూచించాడు. పాపం వైకుంఠం వెళ్ళి దుర్వాసుడు విష్ణువు కాళ్ళమీదపడి తడబడుతూ "ప్రభూ! నీ శక్తి తెలియక నీ భక్తుని అవమానించాను. నాయీ తప్పు మన్నించు. నీనామాన్ని కీర్తించినంత మాత్రంచేత నరకంలో యాతనపడే జీవులకు సహితం కష్టాలు గట్టెక్కుతాయి. నా అపరాధాన్ని క్షమించు" అని వేడుకున్నాడు.

భగవంతుడు భృగుమహర్షి కాలితాపు సైపగలడు. కాని భక్తులకు జరిగిన అవమానాన్ని సహించలేడు. భగవంతుడు దుర్వాసునికి చెప్పిన సమాధానం భక్తుని మహిమను ప్రపంచానికి శాశ్వతంగా చాటి చూపింది. విష్ణుభగవానుడు ఇలా అన్నాడు—

అహం భక్తపరాధీనో హ్యస్వతంత్ర ఇవ ద్విజ ।
సాధుభిర్గ్రస్తహృదయో భక్తైర్భక్తజనప్రియః ॥

నాహమాత్మానమాశాసే మద్భక్తైః సాధుభిర్వినా ।
శ్రియం చాత్యంతికిం బ్రహ్మన్ యేషాం గతిరహం పరా ॥
(శ్రీమద్భాగవతం, 9/4/63–64)

"ఓ బ్రాహ్మణుడా! నేను భక్తపరాధీనుడను. అస్వతంత్రుడను. నాకు భక్తులే అత్యంత ప్రియులు వారికి నా హృదయం మీద సంపూర్ణాధికారం ఉంది. నన్నే పరమగమ్యంగా నమ్మిన మహాభక్తులకోసం నేను నా ఆత్మనుగాని, నా ప్రియపత్ని లక్ష్మిదేవిని గాని లెక్కచేయను", అని చెప్పి ఇంకా ఇలా అన్నాడు– "ఏ భక్తులైతే (నాకోసం) భార్య, పుత్రులనూ, గృహాన్ని, బంధువులనూ, ధనమానప్రాణాలనూ, ఇహపరలోకాలను పరిత్యజించి నన్నే నమ్మి శరణాగతులైన నాభక్తులను నేనెలా విడిచిపెట్టగలను? పతివ్రతలైన పత్నులు తమ ప్రేమానురాగాలతో భర్తను స్వాధీనం చేసుకున్న విధంగా నాయందే తమ చిత్తాలను లగ్నంచేసిన సమదర్శులైన సజ్జనులు కూడా తమయొక్క పవిత్రమైన భక్తితో వారు నన్ను స్వాధీనం చేసుకుంటారు. అటువంటి వారు కాలంలో నశించిపోయే

స్వర్గాదిలోకాలనేమిటి నా సేవాఫలంగా లభించే చతుర్విధ ముక్తులను (సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్యములను) సైతం అంగీకరించరు. నా ప్రేమముందు దేనినైనా అత్యల్పంగా భావిస్తారు వారు. అందుచేత ఓ బ్రాహ్మణా!

శ్లో. సాధవో హృదయం మహ్యం సాధూనాం హృదయం త్వహమ్ ।
మదన్యత్ తే న జానంతి నాహం తేభ్యో మనాగపి ॥
(శ్రీమద్భాగవతం, 9/4–68)

సజ్జనులే నా హృదయం. నేను సజ్జనుల హృదయాన్ని. వారు నన్నుగాక వేరెరుగరు. నేను వారినిగాక వేరెరుగను".

ఇలా భక్తులకూ తనకూ ఉన్న సంబంధాన్ని వివరించి చివరికి తన సహజకారుణ్యం చేత భయవిహ్వాలుడైన దుర్వాసునితో శ్రీమహావిష్ణువు–

శ్లో. బ్రహ్మంస్తద్ గచ్ఛ భద్రం తే నాభాగతనయం నృపమ్ ।
క్షమాపయ మహాభాగం తతః శాంతిర్భవిష్యతి ॥
(శ్రీమద్భాగవతం,9/4–71)

"ఓ బ్రాహ్మణుడా! నీకు శుభమగుగాక, నీవు మహాభాగ్యశాలియు, నాభాగపుత్రుడైన అంబరీష మహారాజువద్దకు వెళ్ళు, ఆయనను క్షమించమని వేడుకో, అప్పుడే నీకు శాంతి లభిస్తుంది", అని చెప్పగా దుర్వాసుడు భగవంతుని అనుజ్ఞతో వెనుదిరిగాడు.

## (3)

ఇక్కడ సాధుహృదయుడు, క్షమామూర్తి అయిన అంబరీషుని పరిస్థితి విచిత్రంగా ఉంది. చక్రం దుర్వాసుని వెంటాడుతూ వెళ్ళినప్పటినుంచి మహర్షికి కలిగిన విపత్తుకు అంబరీషుడు వ్యథచెందాడు. సాధుపురుషుని హృదయం వెన్నకంటె మెత్తన. వేడితనకు తగిలితేనే

వెన్నకరుగుతుంది. కాని ఎదుటివానికి తాపం కలిగినంతలో సాధుపురుషుని హృదయం కరుగుతుంది.

నిజపరితాప ద్రవయి నవనీతా ।
పర దుఃఖ ద్రవహి సంత సుపునీతా ॥

అంబరీషుడి మనస్సు పరిపరివిధాలుగా ఉంది. పాపం బ్రాహ్మణుడు ఆకలితో వెళ్ళాడు. నావల్లనే మృత్యుభయంతో పారిపోవలసి వచ్చింది. ఇటువంటి స్థితిలో నాకు భుజించే అధికారం ఎక్కడిది? ఇలా అనుకుని అంబరీషుడు అప్పటినుండి అన్నంమాని మంచినీళ్ళు మాత్రమే పుచ్చుకుంటూ ఉన్నాడు? దుర్వాసుడు తిరిగి రావడానికి సంవత్సరకాలం పట్టింది. అప్పటివరకూ మహారాజు 'అనశనవ్రతం' మానలేదు. దుర్వాస దర్శనాపేక్షతో కేవలము నీళ్ళు మాత్రమే త్రాగుతూ ఉండిపోయాడు.

దుర్వాసుడు రావడం రావడమే మహారాజు కాళ్ళమీద వాలిపోయాడు. మహారాజు సిగ్గుపడ్డాడు బ్రాహ్మణుడు బాధపడుతున్నాడని, ఆయనకింకా బాధకలిగింది. ఆయన వినయపూర్వకంగా, సముచితంగా సుదర్శనాన్ని స్తుతించి శాంతింపచేశాడు. దుర్వాసునికి మృత్యుభయం తొలగిపోయింది. ఆయన ముఖంలో సంతోషం, కృతజ్ఞత వెల్లివిరిశాయి. ఆయన ఆశీర్వదిస్తూ– "ఆహా! నేడుగదా నేను భగవద్భక్తుల మహిమ దర్శించగలిగాను. నేను నీకింత అపకారం తలపెట్టినా నీవు నా క్షేమమే తలచావు. భక్తవత్సలుడైన భగవంతుని స్వాధీనం చేసుకున్న వారికి చేయలేని దుష్కరకార్యమూలేదు, చేయరాని మహాత్యాగములేదు. ఎవని నామ శ్రవణమాత్రంచేత మానవులు పాపరహితులవుతారో అటువంటి శ్రీహరిని సేవించే దాసులు చేయలేని కార్యమేమిటి?"

"ఓ రాజా! నీవు పరమ దయాళుడవు, నాపట్ల చాల కనికరం చూపించావు. నాతప్పులెంచక నా ప్రాణాలు కాపాడావు. మహర్షిమాటలకు అంబరీషుడు ఉప్పొంగిపోలేదు. లోకంలో మనుష్యులు కొంచెం మెరమెచ్చుమాటలు వింటేనే తెగ పొంగిపోతారు. అటువంటిది యథార్థ

వాక్యాలు విన్నా అంబరీషుడు తొణకకుండా ఇదంతా భగవత్కృపా ప్రభావం అనుకున్నాడు.

విజ్ఞులైన పాఠకులారా! ఈ కథలోని నిజమైన భక్తుని యథార్థలక్షణాలు గ్రహించండి. అపకారికి కూడా ఉపకారం చేయాలి. కష్టపెట్టేవారిని కూడా సుఖపెట్టాలి. ముళ్ళుగుచ్చే వారికి కూడా పూలుపంచిపెట్టాలి. చంపవచ్చిన వారిని కూడా కాపాడాలి. ఇవే సుగుణాలు.

అనంతరం దుర్వాసమహర్షి పాదములకు నమస్కరించి అంబరీషుడు సాదరంగా భోజనం పెట్టాడు. దుర్వాసుడు సెలవు తీసుకున్నాక భుక్తశేషాన్ని మహారాజు పవిత్ర ప్రసాదంగా స్వీకరించాడు.

ఇలా అంబరీషుడు తన సమస్తకర్మలను వాసుదేవునికి సమర్పించి భక్తిలో నిమగ్నుడయ్యాడు. కొంతకాలానికి రాజ్యాన్ని కుమారులకు అప్పగించి ఆత్మస్వరూపుడైన వాసుదేవునియందే మనస్సు నిలిపి వానప్రస్థం గడిపి చివరికి త్రిగుణాతీతుడై మోక్షపథం చేరుకున్నాడు.

భక్తునకు భగవంతునకు జయమగుగాక

----oOo----

# 4. భీష్మపితామహుడు

శ్లో. పరిత్యజేయం త్రైలోక్యం రాజ్యం దేవేషు వా పునః ।
యద్వాప్యధికమేతాభ్యాం న తు సత్యం కథంచన ॥ *
(భీష్మ)

భక్తాగ్రేసరుడు భీష్మపితామహుడు, శంతన మహారాజుకు ఔరసపుత్రుడు. గంగాదేవి పవిత్రగర్భంలో భీష్ముడు జన్మించాడు వశిష్ఠమహర్షి శాపవశంగా అష్టవసువులు మానవజన్మనెత్తవలసి వచ్చింది వారిలో వరుసగా ఏడుగురిని పుట్టగానే గంగాదేవి నదీప్రవాహంలో కలిపివేసి వారిని శాపవిముక్తులను చేసింది. అష్టమగర్భంలో పుట్టిన "ద్యౌ" అను వసువు అంశావతారంగా జన్మించిన భీష్ముని శంతనుడు ఏటిపాలు కానీయలేదు. గంగాదేవి బిడ్డను శంతనుని దగ్గరవదిలిపెట్టి వెళ్ళిపోయింది. ఆ బిడ్డకు దేవవ్రతుడని నామకరణం చేశాడు.

ధర్మపరుడైన శంతనమహారాజుకు దాశరాజు పెంపకంలో వున్న

---

* నేను త్రైలోక్య రాజ్యం త్యజించగలను. దేవతలరాజ్యాన్ని కూడా త్యజించగలను. ఈరెండింటి కంటె మహత్తరమైన దాన్ని కూడా త్యజించగలను. కాని సత్యాన్ని త్యజించలేను.

సత్యవతి అనే కన్యమీద మోహం కలిగింది. తండ్రి శంతనుడు విచారగ్రస్తుడుకావడం చూచి దేవవ్రతుడు మంత్రులద్వారా తండ్రి మనోవ్యధకు కారణం గ్రహించాడు. తండ్రికి సంతోషం కలిగించేందుకు దాశరాజును కలిసి అతడు కోరినట్లుగా తాను రాజసింహాసనం అధిష్టించననీ, జీవితాంతం బ్రహ్మచర్యం పాటిస్తాననీ భీషణప్రతిజ్ఞ చేసి సత్యవతీదేవితో తండ్రిగారి వివాహం జరిపించాడు. పితృభక్తితో దేవవ్రతుడు తన జన్మ సిద్ధమైన రాజ్యాధికారాన్నీ శాశ్వతంగా స్త్రీసౌఖ్యాన్నీ పరిత్యజించాడు. దేవవ్రతుని పితృభక్తికి దేవతలు ఆనందంతో పూలవాన కురిపించి, అతన్ని 'భీష్ము'డని పిలిచారు. తన కోసం పుత్రుడు చేసినత్యాగానికి ప్రసన్నుడై శంతనుడు, "నీవు జీవించాలని అనుకుంటున్నంతవరకు మృత్యువు నిన్ను కన్నెత్తి చూడలేదు. నీకు ఇచ్ఛామరణం అనుగ్రహిస్తున్నానని" వరం యిచ్చాడు. నిస్వార్థుడైన పితృభక్తునికి ఆజీవన అస్ఖలితబ్రహ్మచారికి అదో గొప్ప విషయమా? భీష్ముడు తన ప్రతిజ్ఞలను జీవితాంతం నిల్పుకున్నాడని వేరే చెప్పనక్కరలేదుగా!.

భీష్ముడు మహాయుద్ధవీరుడు. సుక్షత్రియుడు. గీతలో క్షత్రియ సహజ లక్షణాలు వర్ణితం–

శ్లో. శౌర్యం తేజో ధృతిర్దాక్ష్యం యుద్ధే చాప్యపలాయనమ్ ।
దానమీశ్వరభావశ్చ క్షాత్రం కర్మ స్వభావజమ్ ॥
(18/43)

వీరత్వము, తీవ్రత, ధైర్యము కౌశల్యము, యుద్ధంలో వెన్నుజూపకుండుట, దానము, ఐశ్వర్యము, ఇవి క్షత్రియ స్వాభావిక గుణాలు.

భీష్మునిలో ఈ క్షత్రియోచిత లక్షణాలు పుష్కలంగా వున్నాయి. వీరరసావతారుడు, క్షత్రియకులసంహారకుడు అయిన పరశురాముడు భీష్మునికి శస్త్రవిద్యాగురువు. నీవు కాశీరాజ కన్య అంబను వివాహం

చేసుకోవాలని పరశురాముడు పట్టుబట్టాడు. భీష్ముడు ఏమాత్రము అంగీకరించలేదు. ఆయనకు సగౌరవంగా నమస్కరించి, వినయ వీరోచిత గాంభీర్యంతో–

శ్లో. న భయాన్నాప్యనుక్రోశాన్నార్థలోభాన్న కామ్యయా ।
క్షాత్రం ధర్మమహం జహ్యామితి మే వ్రతమాహితమ్ ॥
(మహాభారతం, ఉద్యోగ, 178/34)

భయంతోనో, దయతోనో, ధనలోభంతోనో, కామంతోనో నేను క్షత్రియ ధర్మం త్యజించలేను. ఇది నా దీక్ష.

ఎంత చెప్పినా భీష్ముడు సమ్మతించకపోవటంతో పరశురాముడు పదేపదే బెదిరించ సాగాడు. అప్పుడు భీష్ముడు "నేను ఒంటరిగా ఇరవైయొక్కసార్లు దండెత్తి క్షత్రియులను నిర్జించానంటున్నారు. మీరు అలా చెయ్యగలగడానికి కారణం.

"న తదా జాతవాన్ భీష్మః క్షత్రియో వాపి మద్విధః ।"

ఆనాడు భీష్ముడుగాని, భీష్మునితో సమానమైన క్షత్రియుడుగాని భూమండలంలో జన్మించివుండలేదు. ఇప్పుడు నేను యుద్ధంలో మీ గర్వాన్ని నిస్సంశయంగా వదిలించి వేస్తాను".

వ్యపనేష్యామి తే దర్పం యుద్ధే రామ న సంశయః ।" అన్నాడు.

పరశురామునికి చాలకోపం వచ్చింది. యుద్ధంతప్పలేదు. ఇరవైమూడు రోజులపాటు ఏకధాటిగా భయంకర యుద్ధం సాగింది. పరశురాముడు భీష్ముని ఓడించలేక పోయాడు. ఋషులు, దేవతలు వచ్చి ఇద్దరినీ శాంతింప జేయబోయారు కాని భీష్ముడు మాత్రం క్షత్రియ. ధర్మోచితంగా శస్త్రం త్యజించలేదు. ఆయన,

శ్లో. మమ వ్రతమిదం లోకే నాహం యుద్ధాత్ కదాచన ।
విముఖో వినివర్తేయం పృష్ఠతోऽభ్యాహతః శరైః ॥

నాహం లోభాన్న కార్పణ్యాన్న భయాన్నార్థకారణాత్ ।
త్యజేయం శాశ్వతం ధర్మమితి మే నిశ్చితా మతిః ॥
(మహాభారతం, ఉద్యోగ, 185/25–27)

యుద్ధంలో వెన్నుచూపడం, వెన్ను చూపి బాణప్రహరణాలు భరిస్తూ యుద్ధంనుంచి నిష్క్రమించడం అనేవి చెయ్యనని నా ప్రతిజ్ఞ. లోభ, దైన్య భయాలవల్లనో అర్థాదులకోసమో. ఏకారణం చేతనైనా నేను సనాతన ధర్మాన్ని విడిచి పెట్టను. ఇది నాదృఢదీక్ష" అన్నాడు.

ఇరవైయొక్కసార్లు దండెత్తి భూమండలంలోని క్షత్రియులను నాశనంచేసిన అమిత తేజస్వి అయిన పరశురాముడు భీష్ముని జయించలేక పోయాడు. మధ్యలో దేవతలు అడ్డుకొని యుద్ధం ఆపారు. అయినా భీష్మునికి వ్రతభంగం కాలేదు.

సత్యవతీకుమారులు ఇద్దరూ చనిపోగా భరతవంశానికి, రాజ్యానికి ఆధారం లేకపోయింది. అపుడు సత్యవతీదేవి భీష్ముని రాజ్యసింహాసనం అధిష్ఠించమనీ, సంతానవంతుడివి కమ్మని అడిగింది. కావాలనుకుంటే ఈమిషమీద మీద భీష్ముడు కళంకరహితుడు అనిపించుకుంటూనే రాజ్యభోగాలనూ, స్త్రీసౌఖ్యాన్ని పొందివుండేవాడు. కాని భీష్ముడు, తన ప్రతిజ్ఞాపాలనకై మానవ మనస్సును బలంగా ఆకర్షించే ఈ రెండు భోగాలనూ కాలదన్నాడు. సత్యవతీదేవి గట్టిగా పట్టుబట్టినప్పుడు భీష్ముడు విస్పష్టంగా అమ్మా! దీనికోసం ఆగ్రహించవలదు. పంచభూతాలు తమతమ స్వభావం విడువవచ్చుగాక, సూర్యుడు వేడిమిని, చంద్రుడు చలువను విడువవచ్చుగాక, ఇంద్రుడు తన శక్తిని, యముడు తన ధర్మాన్ని విడువవచ్చుగాక, నేను త్రైలోక్యరాజ్యలాభం కోసంగాని, అంతకుమించిన మహత్తర ప్రయోజనం కోసంగాని నాకు అత్యంత ప్రీతికరమైన సత్యాన్ని విడిచి పెట్టజాలను" అన్నాడు.

దుర్యోధనుని దుష్టత మానిపించాలని భీష్ముడు నయానా, భయానా చెప్పిచూశాడు కాని అతడు వినలేదు. చివరికి యుద్ధం తప్పలేదు. భీష్మునికి పాండవుల మీద మక్కువవున్నా కష్ట సమయంలో ఆశ్రయం ఇచ్చిన వారిని విడువకూడదనే ధర్మానికి కట్టుబడి కౌరవసైన్యాధ్యక్షుడై పాండవులతో యుద్ధం చేశాడు. వృద్ధుడైనా పదిరోజులపాటు పోరాడి అనేక మంది యోధులను పరిమార్చాడు. ఇంకా అనేకులను క్షతగాత్రులను చేశాడు. భీష్ముడే కౌరవసైన్యానికి పరమరక్ష. భారతయుద్ధం సాగిన పద్దెనిమిది రోజులలో భీష్ముడొక్కడే పదిరోజులు సేనాధిపత్యం వహించాడు. మిగతా ఎనిమిది రోజుల్లో ఎందరో సేనాపతులు మారారు. అంత స్థిరంగా యుద్ధం చేసినప్పటికీ భీష్మునికి పాండవులు ధర్మపరులు కాబట్టివారే అంతిమ విజయం సాధిస్తారని తెలుసును.

భీష్ముడు జ్ఞాని, దృఢవ్రతుడు, ధర్మవిదుడు, సత్యవాది, పండితుడు, రాజనీతిజ్ఞుడు, ఉదారుడు, జితేంద్రియుడు, అసమానయోధుడు, అనన్యభక్తుడు, శ్రీకృష్ణుడు సాక్షాత్తు భగవంతుడేనని మొట్టమొదట గ్రహించింది భీష్ముడే. రాజసూయ యాగంలో ధర్మరాజు, "అగ్రపూజ ఎవరికి చేయమంటా"రని అడిగినప్పుడు భీష్ముడు స్పష్టంగా బలతేజో పరాక్రమాది సమస్త గుణాలతో సర్వశ్రేష్ఠుడైన శ్రీకృష్ణుడే ప్రథమ పూజార్హుడని చెప్పాడు. భీష్మానుమతంగా సహదేవాదులచే శ్రీకృష్ణుని పూజిస్తున్నప్పుడు శిశుపాలాది, భూపతులు కుపితులై ఉద్రేకించి ఈ గర్విష్ఠి వృద్ధుని, పశువును వధించినట్లు ఖండఖండాలుగా వధించండి. సలసలకాగే నూనె కళాయిలో పడవెయ్యండి, అని అరిచాడు. అయినా భీష్ముడు తన సహజశాంతాన్ని విడువక, కొంచెం కూడా తొట్రుపడక శ్రీకృష్ణుడే సర్వలోకాలకు సృష్టిస్థితిలయ కారకుడని నేనెరుగుదును. చరాచర విశ్వాన్ని సృజించింది శ్రీకృష్ణుడే. శ్రీకృష్ణుడే అవ్యక్త ప్రకృతి, కర్త, సర్వభూతజాల స్రష్ట, సనాతనుడు, పరబ్రహ్మ. శ్రీకృష్ణుడు సర్వగుణాలవాలుడు. శ్రీకృష్ణుడే అందరిపూజలూ అందుకోదగినవాడు. శ్రీకృష్ణునికి అగ్రపూజ చేయడంవల్ల తమ మానమర్యాదలు మంటగలిశాయని యీరాజులు భావిస్తున్నారు. వీరు శ్రీకృష్ణునితో యుద్ధంచేసి తమ అధిక్యతను ప్రదర్శించుకోవచ్చును. శ్రీకృష్ణుడే

సర్వోన్నతుడు. సర్వులకు గురువు, బంధువు. రాజన్యులందరిలో పరాక్రమఘనుడు. శ్రీకృష్ణుని అగ్రపూజను వ్యతిరేకించే మూర్ఖులకు అర్థమయ్యేటట్లు ఎలానచ్చజెప్పగలం? అన్నాడు.

యజ్ఞంలో విఘ్నాలకు భయపడి ధర్మరాజు భీష్ముని యజ్ఞ రక్షణోపాయం గురించి అడిగినప్పుడు ఆయన యుధిష్ఠిరా! చింతించకు. శిశుపాలుని సంగతి శ్రీకృష్ణుడే చూచుకుంటాడన్నాడు. చివరకు శిశుపాలుని నూరుతప్పులు పూర్తికాగానే శ్రీకృష్ణుడు చక్రంతో అతణ్ణి సంహరించి తనలో లయం చేసుకున్నాడు.

మహాభారతయుద్ధంలో ఆయుధమును ధరింపనని శ్రీకృష్ణుడు ప్రతిజ్ఞచేసి తన భక్తవాత్సల్యం కారణంగా అర్జునునికి సారథిగా మాత్రమే యుద్ధక్షేత్రంలోకి వచ్చాడు. ఏదో నిమిత్తంగా భీష్ముడు ప్రతిజ్ఞచేశాడు. "ఈరోజు శ్రీకృష్ణ భగవానునితో శస్త్రం పట్టిస్తానని" మహాకవి సూరదాసు భీష్మప్రతిజ్ఞను చాల అందంగా వర్ణించాడు. "నేడు శ్రీహరితో శస్త్రం పట్టించకపోతే నేను గంగాశంతనుల పుత్రుడనేకాను. గుర్రాలను రథాలను చెండాడి కపిధ్వజాన్ని కంపింపచేస్తాను. నాయీ శపథం చెల్లించుకోకపోతే క్షత్రియులగతికే నేను తప్పిపోతాను. ఎదురుగావున్న పాండవ సైన్యాన్ని దునుమాడినెత్తుటేరులు ప్రవహింపచేస్తాను. పంతం చెల్లించుకోకుండా బ్రతికి వుండి నేను రణభూమినుండి వైదొలగను".

భీష్ముడు తన ప్రతిజ్ఞ నిలుపుకున్నాడు. శ్రీకృష్ణభగవానుడు తన ప్రతిజ్ఞతప్పవలసి వచ్చింది, విరిగిన రథచక్రశకలాన్ని పట్టుకొని పదేపదే సింహనాదం చేస్తూ జగత్పతి పీతాంబరధారియైన వాసుదేవుడు అడవిరాజైన సింహం, మత్తగజరాజుపైకి వురికేవిధంగా దూకాడు. శ్రీకృష్ణుని పచ్చని వుత్తరీయం జారింది. భూమి దద్దరిల్లింది. చుట్టూవున్న సైన్యంలో భీష్ముడు హతుడయ్యాడు. భీష్ముడు హతుడయ్యాడు అని గగ్గోలుచెలరేగింది. కాని ఆక్షణంలో భీష్మునికి మహదానందం కలిగింది. ఆ ఆనందాన్ని వర్ణించడం అసాధ్యం. భగవానుని భక్తవాత్సల్యానికి పులకించి భీష్ముడు ఆయన్ని ఇలా ఆహ్వానించాడు.

శ్లో. ఏహ్యేహి పుండరీకాక్ష దేవదేవ నమోऽస్తు తే ।
మామద్య సాత్వతశ్రేష్ఠ పాతయస్వ మహాహవే ॥

త్వయా హి దేవ సంగ్రామే హతస్యాపి మమానఘ ।
శ్రేయ ఏవ పరం కృష్ణ లోకే భవతి సర్వతః ॥

సంభావితోऽ స్మి గోవింద త్రైలోక్యేనాద్య సంయుగే ।
ప్రహరస్వ యథేష్టం వై దాసోऽస్మి తవ చానఘ ॥

"ఓ పుండరీకాక్షా! రమ్ము రమ్ము, దేవదేవా! నీకు నమస్కారము. ఓ పురుషోత్తమా! నేడీ మహాయుద్ధంలో నీవు నన్ను వధించు. పరమాత్మా! కృష్ణా! అనఘా! గోవిందా! యుద్ధంలో నీచేత మరణించడమే నాకు పరమకళ్యాణప్రదం. నేడునేను త్రిలోకాలలో సమ్మాన్యుడను. ఓ పాపహరణా! నాపై యుద్ధంలో యధేచ్ఛగా ప్రహారాలు చేయుము. నేను నీ దాసుడను".

భీష్ముడిలా అంటూవుండగా అర్జునుడు పరుగుపరుగున వచ్చి కృష్ణుని కాళ్ళు పట్టుకొని బ్రతిమాలి వెనక్కు తీసుకు వెళ్ళాడు. భక్తుని ప్రతిజ్ఞ చెల్లించడంకోసం భగవానుడు వెనుదిరిగాడు. భీష్ముడు అర్జునుని బాణాలకే పడవలసివుంది.

భీష్ముడు శిఖండితో యుద్ధం చెయ్యడు. అతని మాటున వుండి అర్జునుడు సంధించిన బాణాలకు భీష్ముడు రథంమీదినుంచి పడిపోయాడు. ఆయన శరీరంలో దిగిన బాణాలే ఆయనకు అంపశయ్య అయ్యాయి. అలా పడిపోయిన భీష్మునికి తల ఆనుకోవడానికి ఆధారంలేదు. తలగడకావాలని అడిగాడు. దుర్యోధనుడు మెత్తని తలగడలు తెప్పించబోయాడు. భీష్ముడు అర్జునుని, "వత్సా! నాకు తగిన తలగడనిమ్మన్నాడు అర్జునుడు శోకిస్తూ ఆయన తల ఆనుకునే విధంగా మూడు బాణాలు వేసాడు" భీష్ముడు సంతోషించి—

శ్లో. శయనస్యానురూపం మే పాండవోపహితం త్వయా ।
యద్యన్యథా ప్రపద్యేథాః శపేయం త్వామహం రుషా ॥

ఏవమేవ మహాబాహో ధర్మేషు పరితిష్ఠతా ।
స్వప్తవ్యం క్షత్రియేణాజౌ శరతల్పగతేన వై ॥
(మహాభారతం, భీష్మపర్వము, 120/48,49)

"నాయనా అర్జునా! శరతల్పానికి తగిన తలగడ ఏర్పరచి నాకు సంతోషం కలిగించావు. నా మాటలు అర్థం చేసుకొనక నీవు ఇతరవిధమైన తలగడలు ఇచ్చి వుంటే కోపంతో నిన్నుశపించి వుండేవాడిని, దృఢమైన క్షత్రియధర్మవ్రతులు ప్రాణత్యాగం చేయడానికి రణభూమిలో ఇటువంటి శరతల్పం మీదనే పవళించాలి" అన్నాడు.

భీష్ముడు గాయాలతో శరతల్పంమీదపడి ఉన్నాడు. గాయాలకు మందువేసి కట్లుకట్టించాలని ఎందరినో శస్త్రవైద్యులను పిలిపించాడు. కాని భీష్ముడు వైద్యం వద్దని వారిని పంపించివేసి తన ఇష్టదైవం శ్రీకృష్ణుని కన్నులలో నింపుకొని మృత్యువుకోసం ఎదురుచూడ సాగాడు. ఎట్టివీరుడు? ఎంతధన్యుడు?

భీష్ముని ధర్మనిరతి, సత్యస్థిరత, అకుంఠిత ప్రతిజ్ఞాపాలన చిరస్మరణీయం. ఆ అసమాన వీరుని గౌరవార్థం ఋషులు నిత్య తర్పణంలో భీష్మునికి జలాంజలి ఘటించే నియమం ఏర్పాటు చేసారు.

శ్లో. వైయాఘ్రపదగోత్రాయ సాంకృతప్రవరాయ చ ।
అపుత్రాయ దదామ్యేతజ్జలం భీష్మాయ వర్మణే ॥

భీష్మపితామహునికి క్షత్రియులే కాదు బ్రాహ్మణులు కూడా జలాంజలి అర్పిస్తూ తర్పణాలువిడుస్తారు. ఈ విధంగా భీష్ముని జ్ఞాపకం చేసుకోవటమే కాదు తద్వారా, భరతవీరులనుకూడా జ్ఞాపకం చేసుకోవడమే అవుతుంది.

భీష్ముని శరీరం నశించింది. కాని "భారతం" అనే పేరు ఉన్నంతకాలమూ దానిలో ఆయన అలౌకిక వచనామృతంతో నిండిన మహాభారతంలోని శాంతి, అనుశాసనిక పర్వాలు వున్నంత కాలమూ ఆయన అమరత్వం, నాశరహితమైనది. భారతీయులు ఆయన దివ్యోపదేశసారాన్ని గ్రహించి నిస్వార్థ భగవత్సేవ ద్వారా జీవితాలను సార్థకం చేసుకోవాలి.

ఆ తరువాత ఎనిమిది రోజులకు భారతయుద్ధం ముగిసింది. ధర్మరాజు రాజ్యాభిషిక్తుడైనాడు. ఒకనాడు ధర్మరాజు శ్రీకృష్ణుని చేరి కైమోడ్చి నమస్కరించి కుశల ప్రశ్నలు వేశాడు. కాని, కృష్ణునినుంచి సమాధానం లేదు. భగవంతుడు ధ్యానమగ్నుడు కావడంచూసి ధర్మరాజు, "ప్రభూ! నీవు ఎవరి గూర్చిధ్యానిస్తున్నావు? అన్నాడు. అందుకు కృష్ణుడు, "ధర్మజా! శరతల్పగతుడైన పురుష పుంగవుడు భీష్మపితామహుడు నన్ను ధ్యానిస్తున్నాడు. నన్ను స్మరించే భీష్ముని వద్దకు వెళ్ళాను" అన్నాడు. శ్రీకృష్ణుడు, యుధిష్ఠిరా! వేదధర్మాలు చక్కగా తెలిసినవాడు, దృఢబ్రహ్మచర్యావ్రతుడు, అపారానుభవశాలి, కురుకుల సూర్యుడు, పితామహుడు అస్తమించినపుడు జ్ఞానభాస్కరుడు కూడా నిస్తేజం అవుతాడు. వెళ్ళి, ఆయన ఉపదేశం గ్రహించు" అని బోధించాడు.

యుధిష్ఠిరుడు శ్రీకృష్ణునితో కలిసి భీష్మునివద్దకు వెళ్ళాడు. అక్కడ బ్రహ్మవిదులైన ఋషులు మునులు వున్నారు. భీష్ముడు శ్రీకృష్ణునికి నమస్కరించి స్తుతించాడు. శ్రీకృష్ణుడు భీష్మునితో ఉత్తరాయణ పుణ్యకాలానికి ఇంకా ముప్పైరోజులుంది. ఈ లోపునీవు సంపాదించిన ధర్మశాస్త్రజ్ఞానాన్ని యుధిష్ఠిరునికి, బోధించి అతని దుఃఖం దూరం చెయ్యి" అన్నాడు. భీష్ముడు, "ప్రభూ! నాశరీరం బాణక్షతాలతో బాధపడుతున్నది. మనస్సు, బుద్ధి స్థిరంగా లేవు. మాట్లాడేశక్తి సన్నగిల్లుతున్నది. పదేపదే స్పృహతప్పిపోతున్నది. కేవలం నీ అనుగ్రహంవల్లనే ఇప్పటివరకూ బ్రతికివున్నాను. పైగా నీవు జగద్గురుడవు. నీ సమక్షంలో నేను ధర్మవిషయాలు మాట్లాడటం అవినయం. నేను మాట్లాడలేక పోతున్నాను. నన్ను మన్నించమన్నాడు. ప్రేమమయ

దృక్కులతో చూస్తూ భగవానుడు గద్గదస్వరంతో "భీష్మా" నీ బాధ, దుఃఖం మూర్ఛ, దాహం, క్షుధ, వ్యధ, సర్వం నా అనుగ్రహంతో ఇప్పుడే తొలగి పోతాయి. నీ అంతఃకరణంలో జ్ఞానస్ఫూర్తి, ప్రకాశమానంగా వుంటుంది. నీ బుద్ధి నిశ్చలంగా వుంటుంది. నీ మనస్సు సత్త్వగుణంతో దృఢంగా ఉంటుంది. నీవు ధర్మము లేదా మరింకేదైనా విద్యను తలచిన మాత్రం చేత సకల జ్ఞానమూ స్ఫురిస్తుంది" అని నా భక్తుని యశస్సు సువ్యక్తం కావాలనే ఉద్దేశ్యంతో నాకు మారు నీవు ధర్మజునికి ఉపదేశం చేయాలని ఆశిస్తున్నానన్నాడు. భగవత్కరుణచే భీష్ముని శారీరక వేదన తత్కాలమందే తొలగింది. అంతఃకరణం స్వస్థమై బుద్ధి జాగృత్తమైంది.

బ్రహ్మచర్యంతో, అనుభవంతో, జ్ఞానంతో భగవద్భక్తితో మహాజ్ఞానియైన భీష్ముడు తొలి పదిరోజుల్లో యుద్ధం చేసినప్పుడున్నంత ఉత్సాహంతో ధర్మరాజుకు వివిధ ధర్మసూక్ష్మలను ఉపదేశించి శ్రీకృష్ణుని సమక్షంలో ఋషిపుంగవులమధ్య ధర్మసూక్ష్మలు వివరించి ఉత్తరాయణ పుణ్యకాలం రాగానే భీష్ముడు మౌనంగా ఉండి, పీతాంబరధారి అయిన శ్రీకృష్ణ పరమాత్మయందే మనస్సు కేంద్రీకరించి ఆయనను స్తోత్రం చేశాడు.

**ఇతి మతిరుపకల్పితా వితృష్ణా భగవతి సాత్వతపుంగవే విభూమ్ని ।**
**స్వసుఖముపగతే క్వచిద్విహర్తుం ప్రకృతిముపేయుషి యద్భవప్రవాహః ॥**

**త్రిభువనకమనం తమాలవర్ణం రవికరగౌరవరాంబరం దధానే ।**
**వపురలకకులావృతాననాబ్జం విజయసఖే రతిరస్తు మేఽనవద్యా ॥**

**యుధి తురగరజోవిధూమ్రవిష్వక్కచలులితశ్రమవార్యలంకృతాస్యే ।**
**మమ నిశితశరైర్విభిద్యమానత్వచి విలసత్కవచేఽస్తు కృష్ణ ఆత్మా ॥**

**సపది సఖివచో నిశమ్య మధ్యే నిజపరయోర్బలయో రథం నివేశ్య ।**
**స్థితవతి పరసైనికాయురక్ష్ణా హృతవతి పార్థసఖే రతిర్మమాస్తు ॥**

**వ్యవహితపృతనాముఖం నిరీక్ష్య స్వజనవధాద్విముఖస్య దోషబుద్ధ్యా ।**
**కుమతిమహరదాత్మవిద్యయా యశ్చరణరతిః పరమస్య తస్య మేఽస్తు ॥**

స్వనిగమమపహాయ మత్ప్రతిజ్ఞామృతమధికర్తుమవప్లుతో రథస్థః ।
ధృతరథచరణోऽభ్యయాచ్చలద్గుర్హరిరివ హన్తుమిభం గతోత్తరీయః ॥

శితవిశిఖహతో విశీర్ణదంశః క్షతజపరిప్లుత ఆతతాయినో మే ।
ప్రసభమభిససార మద్వధార్థం స భవతు మే భగవాన్ గతిర్ముకుందః ॥

విజయరథకుటుంబ ఆత్తతోత్రే ధృతహయరశ్మిని తచ్ఛ్రియేక్షణీయే ।
భగవతి రతిరస్తు మే ముమూర్షోర్యమిహ నిరీక్ష్య హతా గతాః సరూపమ్ ॥

లలితగతివిలాసవల్గుహాసప్రణయనిరీక్షణకల్పితోరుమానాః ।
కృతమనుకృతవత్య ఉన్మదాంధాః ప్రకృతిమగన్ కిల యస్య గోపవధ్వః ॥

మునిగణనృపవర్యసంకులేऽన్తః సదసి యుధిష్ఠిరరాజసూయ ఏషామ్ ।
అర్హణముపపేద ఈక్షణీయో మమ దృశిగోచర ఏష ఆవిరాత్మా ॥

తమిమమహమజం శరీరభాజాం హృది హృది ధిష్ఠితమాత్మకల్పితానామ్ ।
ప్రతిదృశమివ నైకధార్కమేకం సమధిగతోऽస్మి విధూతభేదమోహః ॥
(శ్రీమద్భాగవతం, 9/32–42)

ఏ ఆనందస్వరూపుడైన బ్రహ్మతో ప్రకృతి సంయోగం చెందడంవల్ల యీ సంసారం నడుస్తుందో ఆ యదువంశ పుంగవుడు, సర్వశ్రేష్ఠుడు అయిన శ్రీకృష్ణుని యందు కామరహితమైన నాబుద్ధిని అర్పిస్తున్నాను (32)

త్రిభువన సుందరుడు తమాలతరు (కానుగ చెట్టు) సమాన శరీరుడు సూర్యకిరణాలవంటి గౌరవర్ణ సుందర వస్త్రుడు. ముంగురులు కదలాడే కమలం వంటి ముఖం గలవాడు, అర్జునసఖుడు అయిన శ్రీకృష్ణుని యందు నాకు నిష్కామ భక్తికలుగుగాక! (33)

యుద్ధంలో గుర్రాలవల్ల రేగిన దుమ్మువల్ల ధూమ్రమైన, చంచలమైన ముంగురులతో, శ్రమవల్ల కలిగిన స్వేద బిందువులతో

శోభించే ముఖం కలవాడు. నా తీక్ష్ణ బాణాలతో పగిలిన కవచమూ, గాయపడిన వక్షమూ గలవాడు అయిన శ్రీకృష్ణుని యందు నామనస్సు ఆనందించుగాక! (34)

మిత్రునికోర్కె మేరకు ఉభయపక్షాల మధ్య రథంనిలిపి, చూపులతోనే శత్రువీరుల ప్రాణాలు హరించిన అర్జున సఖుడైన శ్రీకృష్ణుని యందు నామనస్సు ఆనందించుగాక!. (35)

(అర్జునుడు) ఎదురుగా వున్న శత్రుసైన్యంలోని స్వజనులను చంపడానికి విముఖుడై ధనుర్బాణాలు విడువగా ఆత్మజ్ఞానం ఉపదేశించి అతని మోహం తొలగించిన పరమేశ్వరుడైన శ్రీకృష్ణుని చరణాలయందు నామనస్సు ఆనందించుగాక! (36)

"శ్రీకృష్ణునిచే శస్త్రం పట్టిస్తా"నని నే చేసిన ప్రతిజ్ఞనెరవేర్చేందుకు యుద్ధంలో శస్త్రం ధరించి తన ప్రతిజ్ఞను తప్పి రథంమీదినుంచి దూకి రథచక్రశకలం చేబూని నాపైకి ఏనుగుమీదికి సింహంలా భూమికంపించగా భుజంమీది ఉత్తరీయం జారగా ఉరికిన ప్రకాశ మూర్తియైన శ్రీకృష్ణుని శరణు కోరుతున్నాను (37)

నాబాణాలతో కవచం పగిలి శ్యామసుందరుని శరీరము రక్తంతో ఎర్రబారినప్పుడు, నన్ను వధించడానికి శస్త్రంబట్టి ఉరికి వచ్చిన భక్తవత్సలుడైన భగవంతుడే నాకుగతి (38)

అర్జునుని రథంమీద ఒకచేత కళ్లెము, మరోచేత ములుకోల ధరించిన దివ్యసుందరమూర్తి స్వప్రకాశంతో మహాభారత యుద్ధంలో మృతులైన వారికి సారూప్యముక్తి ప్రసాదించిన తేజోవంతుని చేతిలో, మరణించే అదృష్టం నాకు కలుగుగాక! (39)

తన లలితగమనంతో విలాసంతో మనోజ్ఞహాసంతో ప్రేమమయ వీక్షణాలతో అలిగిన గోపికలకు అంతర్హితుడుకాగా విరహవేదనను

అనుభవించే ఆ గోపికలు ఎవరిలీలలను అనుకరించి మరల తన్మయం చెందిరో అట్టిభక్తితో ప్రాప్తించే శ్రీకృష్ణుని యందు నాకు భక్తి దృఢమగుగాక! (40)

యుధిష్ఠిరుని రాజసూయ సభాభవనంలో ఋషుల, మునుల అనేక మహీపతుల సమక్షంలో ఎవరికి అగ్రపూజ జరిగిందో, ఆ సర్వజగత్పూజ్యుడైన పరబ్రహ్మ నా కనులముందు ఉన్నాడు. నేను కృతార్థుడను నా జన్మ ఎంత ధన్యమో (41)

జన్మకర్మరహితుడు, తననుండి ఉత్పన్నమైన ప్రాణుల హృదయాంతర్యామి, వివిధ పాత్రలలో అనేకములుగా కనపడే సూర్యుని ప్రతిబింబములా శోభించే పరమేశ్వరుడైన శ్రీకృష్ణుని మోహరహితమైన అభేదభావంతో నేను పొందగలిగాను (42)

తన నూట ముప్పదిఐదవ సంవత్సరమున ఉత్తరాయణ పుణ్యకాలమున బ్రహ్మవేత్తలు, ఋషులు, మునులు, అందరూ సాక్షాత్తు భగవంతుడైన శ్రీకృష్ణుని స్తుతిస్తూ—

కృష్ణ ఏవం భగవతి మనోవాగ్దృష్టివృత్తిభిః
ఆత్మన్యాత్మానమావేశ్య సోఽన్తఃశ్వాస ఉపారమత్ ॥
(శ్రీమద్భాగవతం,1–9–43)

ఆత్మరూపుడైన శ్రీకృష్ణభగవానుని యందు మనస్సునూ, వాక్కునూ, దృష్టిని నిలిపి భీష్మపితామహుడు పరమపదశాంతిని పొందాడు

భక్తునకు భగవంతునకు జయమగుగాక

----oOo----

# 5. పాండవ మధ్యముడు అర్జునుడు

శ్లో. నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమమ్ ।
దేవీం సరస్వతీం చైవ తతో జయముదీరయేత్ ॥
(మహాభారతం)

శ్రీమన్నారాయణుని కి, సరస్వతీదేవికి, నరోత్తముడైన అర్జునునికి నమస్కరించి వ్యాసభగవానుడు భారతరచన ఆరంభిస్తున్నాడు. ఈ శ్లోకంవల్ల భక్తశ్రేష్ఠుడు వీరాగ్రణి అయిన అర్జునుడు ఏ స్థాయికి చెందిన మహాపురుషుడో గ్రహించవచ్చు. కౌరవులకు నచ్చజెప్పుతూ భీష్మపితామహుడు—

శ్లో. ఏష నారాయణః కృష్ణః ఫాల్గునశ్చ నరః స్మృతః ।
నారాయణో నరశ్చైవ సత్త్వమేకం ద్విధా కృతమ్ ॥
(మహాభారతం, ఉద్యో, 49–20)

శ్రీకృష్ణుడు నారాయణుడు. అర్జునుడు నరుడు. ఒకే సత్వం రెండు రూపాల్లో వ్యక్తం అయ్యింది. గీతలో భగవానుడు స్వయంగా తనవిభూతులను వివరి స్తూ **పాండవానాం ధనంజయః** (10–37) అని

అర్జునుని తన స్వరూపంగా ప్రకటించాడు గదా! ఇకనాబోటి సామాన్యులు అర్జునుని మహిమను ఎలా భావించగలరు? ఏ విధంగా వివరించగలరు? అర్జునుని జీవితవిశేషాలు స్మరిస్తే హృదయం పునీతమవుతుంది. అందుచేతనే అర్జునుని గూర్చి కొంత ఉల్లేఖించడానికి పూనుకోవడం జరిగింది.

భక్తాగ్రణి అర్జునుడు పాండవమధ్యముడు. ఇంద్రుని కారణంగా జన్మించిన మహాపురుషుడైన నరుని అవతారం. భారతపాత్రల్లో అర్జునుడు అత్యంత ప్రధానపాత్ర. శ్రీకృష్ణ భగవానునికి సమవయస్కుడు, సఖుడు. శ్రీకృష్ణుని లాగే అర్జునుడు మనోహర శ్యామవర్ణుడు, మహావీరుడు, ధీరుడు, దయాళువు, ఉదారుడు, అనఘుడు, న్యాయశీలి, చతురుడు, దృఢదీక్షితుడు, సత్యప్రియుడు, గురుజన భక్తుడు, బుద్ధిశాలి, పండితుడు. జితేంద్రియుడు, జ్ఞాని, అనన్య భగవద్భక్తుడు. కాబట్టి ఏ గీతా శాస్త్రాన్ని పఠించి భావించి అనేకానేక సాధకులు పరమపదం పొందారో, ఏ గీతా శాస్త్రమును అసంఖ్యాక మహానుభావులు ఆధ్యాత్మమార్గంగా గ్రహించి పరంధామం చేరడానికి పరమోపాధేయమయ్యిందో, ఆగీతాశాస్త్రామృతపానానికి ప్రప్రథమ అర్హుడు అర్జునుడే కాగలిగాడు. నాడు ఋషివరులకు ముని శ్రేష్ఠులకు, భీష్మయుధిష్ఠిరాది రాజర్షులకు కొదవలేదు. అయినా భగవంతుడు పరమశ్రద్ధాళువు, అంతరంగిక సఖుడు అయిన అర్జునునినే గీతాశ్రవణ యోగ్యునిగా ఎంచుకున్నాడు అది శ్రీకృష్ణ భగవానునికి అర్జునియందు ఎంత ప్రేమాతిశయమో స్పష్టం చేస్తుంది.

దుర్యోధనుడు యుద్ధంలో సహాయాన్ని అపేక్షించి శ్రీకృష్ణమందిరానికి వెళ్ళాడు. అపుడు కృష్ణుడు నిద్రిస్తున్నాడు. దుర్యోధనుడు ఆయన తలవైపు కూర్చున్నాడు. అతని వెనుకే అర్జునుడూ వచ్చాడు. అతడు కృష్ణుని పాదాల చెంత వినయంగా చేతులు జోడించుకొని కూర్చున్నాడు. శ్రీకృష్ణుడు మేల్కొని ముందు కాళ్ళవైపున ఉన్న అర్జునుని, తర్వాత దుర్యోధనుని చూశాడు. ఇరువురికి స్వాగతసత్కారాలు చేశాడు. దుర్యోధనుడు "యుద్ధంలో నీ సహాయంకోరి ముందు నేనువచ్చాను. ఆ తర్వాత అర్జునుడు వచ్చాడు. అందుచేత నీవు నాకే

సహాయం చెయ్యాలి" అన్నాడు. అపుడు కృష్ణుడు–దుర్యోధనా! నీవుముందు రావడం నిజమేకాని నేను ముందు చూసింది అర్జునుని. కనుక ఇద్దరికీ సాయంచేస్తాను" అన్నాడు. నిజమేకదా! కాళ్ళచెంత నున్నవాడే మొదట కనపడతాడుగాని తలవైపున్నవాడు కాడుగదా! దీనివల్ల తేలిన సారాంశం ఏమిటంటే భగవంతునికి భక్తితో ఎదురుగా పాదాలచెంత ఉండాలికాని దురభిమానంతో శిరస్సు దగ్గరగాదు ఉండవలసింది.

శ్రీకృష్ణుడు "ఒక వంక సమస్త యాదవవీరులు శస్త్రాస్త్ర సహితంగా ఉంటారు మరోప్రక్క నిరాయుధుడనై యుద్ధం చేయకుండా నేనొక్కడనే ఉంటాను. ఎవరికి ఏది ఇష్టమో కోరుకోండి. కాని ముందుగా కోరుకోవడానికి అర్జునుడే పాత్రుడు ఎందుకంటే, నేను ముందు చూసింది అర్జునునే గదా?" అన్నాడు. ఇది పెద్ద పరీక్ష. ఒకవైపు భగవంతుని శక్తి, ఐశ్వర్యము. మరోవైపు నిరాయుధుడైన భగవానుడు. భోగప్రియుడు భగవంతునికోరడు. భగవత్ప్రేమికుడు భోగాలనుకోరడు. అర్జునుడు భగవత్ప్రేమికుడు, భోగప్రియుడుకాదు. అర్జునుడు ఒక్క శ్రీకృష్ణుడే నా సర్వస్వం. అతడే నా సహాయం అన్నాడు. పరీక్షలో అర్జునుడు నెగ్గాడు. భోగప్రియుడు దుర్యోధనుడు "మంచిది, శస్త్రహీనునీ, యుద్ధవిముఖునీ అర్జునుడు కోరుకున్నాడు. నాకు యాదవవీరులు లభించారు. అని మనస్సులో అనుకున్నాడు. అర్జునునికి రణశూరుల లోటు లేదనికాదు. కృష్ణుడొక్కడే ఎంతటివాడో అర్జునునికి తెలుసు. ఇలా "భోగాలకంటే భగవంతుడే గొప్ప" అని తలచేవారు సంతోషంగా ఎంతటి భోగాలనయినా పరిత్యజించడానికి సిద్ధపడతారు. వారే యథార్థమైన భక్తులు. వారికి భగవత్ప్రాప్తి కలుగుతుంది. తథ్యం! అందుచేతనే భగవానుడు చేతకళ్ళెం పట్టి హీనమైన సారథిత్వం వహించాడు. అలా భగవంతుడు పాండవపక్షంలో సారథియై రథాన్ని నడిపించకపోతే మహాభారతగాథ వేరే విధంగా లిఖించబడేది? సంజయుడు–

శ్లో. యత్రయోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః ।
తత్రశ్రీర్విజయో భూతిర్ధ్రువా నీతిర్మతిర్మమ ॥

(గీత, 18/78)

అని ఉద్ఘోషించగలిగేవాడు కాదు. అంతేకాదు సర్వ జగత్కళ్యాణకరమైన "గీత" మనకు లభించేదికాదు. అర్జునుని వంటి వత్సము దొరికినపుడే గీతాధేనువును పిదుకడం సాధ్యం. గీతవంటి మహాసంపద అర్జునుని కారణంగానే జగత్తుకు అందినదనేది నిస్సంశయం. అందువల్ల యావత్ జగత్తు అర్జునునికి సదాకృతజ్ఞతతో ఉండాలి.

అర్జునునిలో మహాపురుషుని లక్షణాలు పుష్కలముగా ఉన్నాయి. గురు దక్షిణగా ద్రుపదుని గర్వం అణిచాడు. అగ్రజుని మీద గౌరవంతో యుధిష్ఠిరుని మాట జవదాటలేదు. రాజధర్మంకోసం సత్యపాలనంకోసం తనకైతాను పన్నెండేళ్ళ దేశ బహిష్కారం విధించుకున్నాడు.

ద్రౌపదికి పూర్వజన్మ శాపకారణంగా, తల్లి ఆదేశానుసారం పంచపాండవులు ద్రౌపదీదేవిని పెండ్లాడారు. తదనంతరం నారదుడు వచ్చి రాక్షససోదరులు సుందోపసుందులు తిలోత్తమ అను అప్సరస కారణంగా ఒకరితో ఒకరు పోట్లాడుకుని ఏవిధంగా మరణించారో వివరించి పాండవులకు ఒకనియమం చేశాడు. అయిదుగురికి భార్య ఒక్కతే కావడంచేత సోదరులలో పరస్పరం విరుద్ధభావం రాకుండా ఒక్కొక్కరు సంవత్సరానికి రెండుమాసాల పన్నెండురోజులు ద్రౌపదీదేవితో ఉండాలి. ద్రౌపదీదేవి ఒకరితో ఏకాంతంలో ఉండగా మరొకడు చూడరాదు. అలా చూచినవాడు పన్నెండేళ్ల దేశ బహిష్కార శిక్షాపాత్రుడు. ఇదీ నారదుడు ఏర్పరిచిన నియమం.

సోదరులైదుగురూ ఆ నియమాన్ని పాటించుచున్నారు. ఒకనాడు ఒక బ్రాహ్మణుని గోవులను దొంగలు అపహరించుకుపోయారు. ఆ బ్రాహ్మణుడు రాజప్రాసాదం సమీపంలో "దొంగలను శిక్షించి నాధేనువులను నాకిప్పించండి", అని అరిచాడు. రాజసౌధం నుంచి సమాధానం రాకపోవడంతో అతడు "ప్రజలనుండి వారి ఆదాయంలో ఆరవవంతుపన్ను తీసుకొంటూ, ఆ ప్రజలను రక్షించనిరాజు పరమపాపి" అని దూషించాడు. ఈనాటి పరిస్థితుల్లోనయితే ఆ బ్రాహ్మణుడిని తప్పక కారాగారంలో పడవేయవలసివచ్చేది. ఆ నాటి స్థితివేరు. పైగా పాండవులు ధర్మజ్ఞులు.

అందుచేత బ్రాహ్మణునికి కారాగార శిక్షపడలేదు. అర్జునునికి బ్రాహ్మణుని అరుపులు వినిపించాయి. వెళ్ళి అతనిని వూరడించి, ఆయుధాల కోసం వచ్చాడు. ఆయుధాలు యుధిష్ఠిరుని మందిరంలో ఉన్నాయి. ఆయన ద్రౌపదీదేవితో ఏకాంతంలో ఉన్నాడు. అర్జునునికి ధర్మసంకటం ఏర్పడింది. ఏంచెయ్యాలి? యుధిష్ఠిరుని మందిరంలోకి వెళ్ళడం నియమభంగం అవుతుంది. పన్నెండేళ్ళ దేశ బహిష్కార శిక్షతప్పదు. బ్రాహ్మణునికి న్యాయం చేయకపోతే క్షత్రియధర్మం తప్పడం అవుతుంది. రాజ్యపాలనలో లోపం చేసినట్లవుతుంది. చివరకు అర్జునుడు క్షత్రియధర్మమే ముఖ్యమని అనుకున్నాడు. యుధిష్ఠిరమందిరానికి వెళ్ళాడు. రాజుకోపగించినా తనకు నియమభంగదోషం కలిగినా, వనవాసమో, మరణమో శిక్షగాపడినా సరే రాజధర్మం విడనాడకూడదనుకున్నాడు. ధర్మపాలన వల్ల తన శరీరం పోయినా ధర్మం నిలిచి ఉంటుందని నిశ్చయించుకున్నాడు.

లోపలినుంచి ఆయుధాలు తెచ్చుకొని దొంగలను వెంటాడి వారిని దండించి గోవులను విడిపించి బ్రాహ్మణునికి అప్పజెప్పాడు.

రాజధర్మనిర్వహణకోసం ఇంటికట్టుబాటు తప్పవలసి వచ్చింది. అందుకు శిక్ష అనుభవించాలి. అర్జునుడు ధర్మరాజు వద్దకు వచ్చి ద్రౌపదీదేవితో మీరు ఏకాంతంలో వుండగా చూచి నేను నియమం తప్పాను. అందుచేత పన్నెండేళ్ళ అరణ్యవాసం అనుభవించే విధంగా తనకు శిక్ష వేయమన్నాడు. ధర్మజుడు ఎంతో నచ్చచెప్పడానికి ప్రయత్నించాడు. కాని ధర్మంతప్పి రాజ్యసుఖాలు అనుభవించడానికి అర్జునుడు ఎంతమాత్రం సమ్మతించక ధర్మరాజుతో–

**శ్లో. న వ్యాజేన చరేద్ ధర్మమితి మే భవతః శ్రుతమ్ ।**
**న సత్యాద్ విచలిష్యామి సత్యేనాయుధమాలభే ॥**

**"మహారాజా! ఏదోసాకు దొరికింది గదా అని ధర్మాన్ని తప్పరాదని నీవు చెప్పగా విన్నాను, సత్యార్థమే ఆయుధాలు తీసుకున్నానని సత్యంనుంచి విచలితుడను కాలేను" అన్నాడు. యుధిష్ఠిరుని మాటలను అడ్డుపెట్టుకుని అర్జునుడు సత్యం విడిచిపెట్టాలనుకోలేదు. అన్నగారి**

ఆజ్ఞగొని వెంటనే వనవాసం వెళ్లాడు అర్జునుని ధర్మపాలన దీక్షకు సత్యశీలతకు ఎంతచక్కని ఉదాహరణ.

ఇపుడు అర్జునుని జితేంద్రియత్వానికి అద్భుత తార్కాణంచూద్దాము.

అర్జునుడు పరమేశ్వరునితో యుద్ధంచేసి మెప్పించి పాశుపతాస్త్రాన్ని ప్రయోగోప సంహారాలతో పొందాడు. అనంతరం యమ, వరుణ, కుబేరాది దిక్పాలకులను మెప్పించి గద, పాశ, అంతర్ధాన, ప్రస్థానాలనే అస్త్రాలు పొందాడు. అంతలో దేవేంద్రుని సారథి మాతలి వచ్చి అర్జునుని రథంమీద కూచోబెట్టుకొని ఆకాశమార్గాన వివిధలోకాలు చూపించుతూ సశరీరంగా స్వర్గానికి తీసుకువెళ్ళాడు. స్వర్గంలో ఐదు సంవత్సరాలుండి వివిధ శస్త్రాస్త్రాలు పొంది చిత్రసేనుడనే గంధర్వుని దగ్గర సంగీతము, నాట్యము నేర్చుకున్నాడు.

ఒకసారి ఇంద్రసభలో అప్సరసల నాట్యగానప్రసంగం జరిగింది. అర్జునుడు అమరేంద్రుని అర్ధాసనం అలంకరించి తిలకిస్తున్నాడు. అర్జునుడు పదేపదే ఊర్వశి వంక చూస్తున్నట్లు ఇంద్రుడు గమనించాడు. ఇంద్రుడు ఏకాంతంలో చిత్రసేనునితో "నీవు ఊర్వశిని యీ రాత్రికి అర్జునుని మందిరానికి వెళ్ళమన్నా"నని చెప్పమన్నాడు. ఊర్వశికి రహస్యంగా చిత్రసేనుడు ఇంద్రునిసందేశం అందించాడు. అర్జునుని మనోహర ముఖకాంతిని, శ్యామసుందర విగ్రహాన్ని, విశాల వక్షాన్ని, సింహవలగ్నాన్ని, మత్తగజేంద్రయానాన్ని, కమల నేత్రాలనూ, వినయమధుర కంఠస్వరాన్ని, విష్ణుసమాన పరాక్రమాన్ని చూసి ఊర్వశి ముందే అతణ్ణి మోహించింది. అందువల్ల ఇంద్రుని సందేశం అమితానందం కలిగించింది. ఆ వెన్నెల రాత్రి మునిగణమనోహారిణియైన ఊర్వశి మనోజ్ఞవస్త్రాలంకృతయై, అర్జునుని ఏకాంత మందిరానికి వెళ్ళినది. శయనాగారంలో ఊర్వశిని ఆరాత్రి వేళ చూసి అర్జునుడు సిగ్గుతో తలవంచుకుని గౌరవంగా పరామర్శించాడు. ఊర్వశికి ఇంద్రుని సందేశం వినిపించింది. తన మనోరథం నెరవేర్చమని వినయంగా ప్రార్థించింది. జితేంద్రియుడైన అర్జునుడు ఎలాంటి మనోవికారానికి లోనుకాక,

నిర్వికారంగా "తల్లీ! నీవు మా వంశ మూలపురుషుడైన పురూరవుని భార్యవు. భారతకుల జనయిత్రివి. అందువల్ల ఇంద్రసభలో నిన్ను చూసి మాతృభావంతో మనస్సులో నమస్కరించుకున్నాను. దేవేంద్రుడు అపార్థం చేసుకున్నాడు. నన్ను మన్నించి కృపతో ఎలావచ్చావో అలా వెళ్ళవలసిందిగా కైమోడ్చి కోరుతున్నాను. నీ బిడ్డవంటి నాతో ఇట్టి ఘోరమైన మాటలు పలుకవద్దు" అన్నాడు. ఊర్వశి "మనోహరా! పురూరవుని తర్వాత స్వర్గానికి వచ్చిన ఆ వంశ ప్రభువులందరూ అప్సరసలను భోగించారు. "అప్సరసస్సాంగత్యమే స్వర్గసుఖం" అని ధీరుడైన అర్జునుని లోబరుచుకోవడానికి తన విలాస విభ్రమ చేష్టలతో వివిధ ప్రయత్నాలు చేసింది. అపుడు అర్జునుడు–

శ్లో. శృణు సత్యం వరారోహే యత్వాం వక్ష్యామ్యనిందితే ।
శృణ్వంతు మే దిశశ్చైవ విదిశశ్చ సదేవతాః ॥

యథా కుంతీ చ మాద్రీ చ శచీ చైవ మమానఘే ।
తథా చ వంశజననీ త్వం హి మేఽద్య గరీయసీ ॥

గచ్ఛ మూర్ధ్నా ప్రపన్నోఽస్మి పాదౌ తే వరవర్ణిని ।
త్వం హి మే మాతృవత్పూజ్యా రక్ష్యోఽహం పుత్రవత్త్వయా ॥
(మహాభారతం, వన 46/45–47)

"దేవీ! సత్యం చెబుతున్నాను విను, సర్వదిక్కులూ, దిక్పాలకులు ఈ మాటలను ఆలకించుగాక! వంశమాతా! నీవు నాకు కుంతీదేవి, మాద్రీదేవి, శచీదేవి వలె పూజ్యురాలవు. నన్ను నీ బిడ్డగా భావించి రక్షించు. నీ పాదాలకు శిరస్సువంచి నమస్కరిస్తున్నాను", అన్నాడు. అర్జునుని మాటలకు ఊర్వశికి చాలబాధ కలిగింది. కోపంవచ్చింది.

ఒక సంవత్సరం నీవు నపుంసకత్వంతో నృత్యగానాలలో నిమగ్నుడవగుదువుగాక! లోకులు నిన్ను పురుషుడవని భావించకుందురుగాక! అని శపించి వెళ్ళిపోయింది. అర్జునుడు శాపాన్ని సహించాడుగాని బ్రహ్మచర్యాన్ని త్యజించలేదు.

సర్వాంగ శోభితంగా అలంకృతమైన అతిలోకసుందరి ఊర్వశి ఎదురైె కామభిక్ష కోరినా, దేవపూజార్హుడైన అర్జునుని వంటి నవయౌవనునికి కించిన్మాత్రంగానైనా కామవికారం కలగకపోవడం అసాధారణ విషయం. రామకృష్ణ పరమహంస "సభల్లో త్యాగిగా కనపడేవాడు. నిజమైన త్యాగికాదు. నిర్జన ఏకాంత ప్రదేశంలో అందమైన యువతిని చూచి 'అమ్మా' అని అమలిన భావంతో అచటినుంచి వైదొలగిపోయే వాడే నిజమైన త్యాగి" అంటూ ఉండేవాడు. అర్జునుని నిష్ఠ అంతకంటె సమున్నతం. అదే భక్తలక్షణం. కల్లబొల్లి మాటలూ, మెరమెచ్చు మాటలూ నోటితో మాట్లాటినంత మాత్రాన ఎవరూ భక్తులు కాజాలరు. భక్తుడు ఇంద్రియాలను జయించాలి. ప్రతి రాజకుమారునికి సారథిగా ఉండేటంత అమాయకుడు గాదు భగవంతుడు. అలాగే ప్రతిరాజు చేసే యజ్ఞంలో చాకిరీ చేసేటంత వెఱ్ఱిబాగులవాడూ కాదు. అర్జునుని మహాత్యాగమూ, యథార్థప్రేమ శ్రీకృష్ణుని ఆకర్షించాయి. కాకుంటే అర్జునునివంటి త్యాగి ఎక్కడుంటాడు? ఏడి? ఇప్పుడెక్కడ చూస్తే అక్కడ పరస్త్రీ, ధనాపహరణ తత్పరులైన వంచకులూ, ద్రోహులే. భక్తుడు కాదలచిన పురుషుడు అర్జునునియొక్క ఈ ఉత్తమ ఆచరణలను పాటించవలసినదే.

అర్జునుడు దివ్యాస్త్రసంపన్నుడు. అయినా శత్రువులపై వారి సామర్థ్యాన్ని బట్టి మానవాస్త్రాలనే ప్రయోగించేవాడు. శంకరుడిచ్చిన పాశుపతాన్ని భారతయుద్ధంలో ఎవరిమీద ప్రయోగించలేదు. అతడింత బలవంతుడైనా గర్విష్ఠికాదు. అతని భక్తి, సభ్యత గంభీరత, ప్రతిభావివేకాలు, ఆతని దిగ్దిగంత విజ్ఞాన శౌర్యంతో కలిసి పసిడికి తావి అబ్బినట్లు శోభించాయి. తన సుగుణాల కారణంగానే దశనామాలతో అర్జునుడు ప్రసిద్ధుడయ్యాడు తన అచంచల భక్తి కారణంగానే శ్రీకృష్ణ భగవానుడు అతనిని అత్యంత సంకటకర పరిస్థితులలో సైతం కాపాడి, అతని గౌరవప్రతిష్ఠలు ఇనుమడింపజేశాడు. కొన్ని ఉదాహరణలు చూద్దాం.

(1)

ద్వారకలో ఒక బ్రాహ్మణుడుండేవాడు. అతనికి ఒక పుత్రుడు

జన్మిస్తూనే చనిపోయాడు. ఆ బిడ్డశవాన్ని తీసుకుని అతడు రాజద్వారం వద్దకు వచ్చి, ఏడుస్తూ "బ్రాహ్మణద్రోహి, శఠుడూ, లోభీ, విషయలంపటుడు అయిన క్షత్రియాధముడైన రాజు యొక్క కర్మదోషం వల్లనే నాబిడ్డ చనిపోయాడు" అనీ –

శ్లో. హింసావిహారం నృపతిం దుశ్శీల మజితేంద్రియమ్ ।
ప్రజా భజన్త్యః సీదంతి దరిద్రా నిత్యదుఃఖితాః ॥
(శ్రీమద్భాగవతమ్,10–89–25)

"రాజుహింసారతుడు, దుశ్చరిత్రుడు, విషయలోలుడూ అయితే ప్రజలుదారిద్ర్యాది అనేక దుఃఖాలతో నిత్యపీడితులవుతారు" అంటూ శిశుకళేబరాన్ని అక్కడే వదిలి వెళ్ళిపోయాడు. ఆ బ్రాహ్మణుని మీద రాజద్రోహనేరం ఆరోపింపబడలేదని వేరే చెప్పనక్కర్లేదనుకుంటాను. ఇలా అతనికి వరుసగా ఎనమండుగురు బిడ్డలు పుడుతూనే చనిపోయారు. వారిశవాలను రాజద్వారంవద్ద వదలి వేసేవాడు. యాదవులు ఎన్నోవిధాల బ్రాహ్మణుని దురదృష్టం పోగొట్టడానికి ప్రయత్నించారు. కాని ప్రయోజనం లేకపోయింది. తొమ్మిదో బిడ్డశవాన్ని తీసుకుని బ్రాహ్మణుడు రాజభవనానికి వచ్చాడు. విధివశంగా అప్పుడు అర్జునుడక్కడే ఉన్నాడు. అర్జునుడు బ్రాహ్మణునితో–"దేవా! మీరు ఎందుకు దుఃఖిస్తున్నారు. ఇక్కడ మిమ్మల్ని పుత్రశోకం నుంచి కాపాడే క్షత్రియవీరుడెవరూ లేరా? యజ్ఞకర్మవిదులైన బ్రాహ్మణులు స్త్రీపుత్ర ధనాదుల వియోగంతో దుఃఖించే రాజ్యాలను ఏలేరాజులు రాజులుకారు. వారు కుక్షింభరులు. విషయలంపటులు. రాజవేషంలో వున్న పాషండులు. మీ బిడ్డలను నేను రక్షిస్తాను. రక్షించలేకపోతే ప్రాయోపవేషం చేస్తాను" అన్నాడు. అపుడు బ్రాహ్మణుడు సంకర్షణుడు, వాసుదేవుడు, ప్రద్యుమ్నుడు మరియు అనిరుద్ధుడు మొదలగు సమర్థులే కాపాడలేకపోయారు. నీవేం చేయగలవు?" అన్నాడు. అర్జునుడు అభిమానంతో "నేను సంకర్షణుడను కాను, వాసుదేవుడనూ, ప్రద్యుమ్నుడను, అనిరుద్ధుడను కాను. శ్రీకృష్ణభక్తుడను. శ్రీకృష్ణుడు తానుగా చేయలేని పనిని, ఆయన శక్తి ద్వారా నేను చేయగలను. ఎందుకంటే నాకోసం శ్రీకృష్ణుడు తన నియమాన్ని సైతం అతిక్రమించవలసి వస్తుంది. నేను గాండీవధనుర్ధారిని, అర్జునుడను.

మృత్యువును సైతం జయించి నీ బిడ్డను బ్రతికిస్తాను" అన్నాడు. శ్రీకృష్ణుడు చిరునవ్వునవ్వి భవిష్యలీలను తలచుకున్నాడు. బ్రాహ్మణపత్ని ప్రసవసమయం దగ్గరపడుతుందని తెలిసి అర్జునుడు శుచియై వెళ్ళి గాండీవాన్ని ఎక్కుపెట్టి దివ్యాస్త్రాలను స్మరించి సూతికాగృహాన్ని (పురిటిల్లు) చుట్టూ బాణాలలో పంజరంగా దిగ్బంధం (అంటే లోనికి వెళ్ళుటకు ఎవరికీ సాధ్యము కానివిధంగా గృహాన్ని దిగ్బంధము) చేశాడు. శ్రీకృష్ణపరమాత్మ లీలలు కడువిచిత్రం. బ్రాహ్మణునికి బిడ్డ పుట్టాడు. ఏడుస్తూనే ఆ బిడ్డ అదృశ్యం అయ్యాడు. బ్రాహ్మణుడు దుఃఖిస్తూ కృష్ణునివద్దకు వచ్చి "నా మూర్ఖత్వానికి హద్దులేదు. పిరికిపంద అర్జునుని ఆత్మస్తుతి పూర్వకమైన మాటలు నమ్మాను. అబద్ధాలకోరు తన పరాక్రమాన్ని, తన ధనుస్సును, తననోటితోనే పొగడుకున్నాడు. ఛీ! ఛీ!" అన్నాడు. అర్జునుడప్పుడక్కడే వున్నాడు. అతనిలో ఇంకా అహంభావం తగ్గలేదు. అతడు కృష్ణునితో ఏమీ మాట్లాడక యోగవిద్యద్వారా యమపురికి వెళ్ళాడు. అక్కడ బిడ్డ కనపడలేదు. అక్కడినుండి ఇంద్రుని, అగ్నిని, నైరృతిని, చంద్రుని, వాయువుని, వరుణాది దిక్పాలకుల లోకాలకు వెళ్ళాడు. అతల రసాతలాది లోకాలకు, స్వర్గాది సప్త ఉపరిలోకాలకు ఇంకా అనేక ప్రాంతాలకు వెళ్ళాడు. ఎక్కడా బ్రాహ్మణశిశువు జాడతెలియలేదు. చేసేదిలేక ప్రతిజ్ఞానుసారంగా ప్రాయోపవేశానికి అగ్నికుండం ఏర్పాటు చేసుకున్నాడు. భగవంతుడిక నిలువలేకపోయాడు. అగ్నిప్రవేశం చేయబోయే అర్జునుని ఆపి,

శ్లో. దర్శయే ద్విజసూనంస్తే మావజ్ఞాత్మానమాత్మనా ।
యే తే నః కీర్తిం విమలాం మనుష్యాః స్థాపయిష్యన్తి ॥
(శ్రీమద్భాగవతం,10–89–46)

"మిత్రమా! అసమర్థుడననుకొని నిన్ను నీవు కించపరచుకోకు! (నీవు నీ సర్వశక్తినీ వినియోగించిందెక్కడ? నీ రెండవ రూపాన్ని నేను నీ ఆంతరంగిక సఖుడను నేనున్నాను) పద. మృతులైన బ్రాహ్మణపుత్రులను పదుగురినీ నేను చూపిస్తాను. దీనితో సమస్త విశ్వంలో మనమిద్దరమూ ఎవరమో ప్రఖ్యాతమవుతుంది" అన్నాడు.

అర్జునుని అహంకారం నశించడం ఆవశ్యకం. అది అతనికే శ్రేయస్కరం. అదితొలగి పోయింది. ఇక భగవంతుడు అతనినెలా చావనిస్తాడు. శ్రీకృష్ణుడు అర్జునుని వెంటబెట్టుకొని దివ్యరథారూఢుడై పడమటి దిక్కుగా వెళ్లాడు. పర్వతాలతో కూడిన సప్తద్వీపాలను, సముద్రాలను దాటి లోకాలోక పర్వతం అవతలివైపున్న నిబిఢాంధకార ప్రదేశానికి వెళ్ళాడు. అక్కడ ఆయన రథాశ్వాలు, శైబ్య సుగ్రీవ మేఘ పుష్పబలాహకులు దారి కనపడక తచ్చాడటం మొదలు పెట్టాయి. మహాయోగీశ్వరుడైన భగవంతుడు సహస్రసూర్య సమాన తేజో విరాజితమైన సుదర్శనాన్ని ముందునడిపించి, దాని వెలుగులో రథాన్ని తోలాడు. అంధకారబంధురమైన ఆ ప్రదేశం దాటిన తర్వాత అనంతకోటి సూర్యప్రభాసమానమైన ప్రకాశాన్ని చూశారు. ఆ వెలుగుచూడలేక అర్జునుడు కనులుమూసుకున్నాడు. అనంతరం వారు ఒక మహాసముద్రంలోదిగారు. అక్కడ అత్యంత జ్యోతిర్మయమైన మందిరాన్ని చూశారు. ఆ మందిరంలో ధగద్ధగాయమానమైన మణులతో పొదిగిన వేలాది సువర్ణస్తంభాలున్నాయి. మందిరాంతర్భాగంలో శ్వేతపర్వతం వంటి శేషఫణిరాజును చూశారు. శేషుని ప్రకాశమానమైన మణిగణంతో శోభించే ఫణసహస్రాన్ని ద్విసహస్రనీలనేత్రాలను, జిహ్వాలనూ కంఠాలనూ చూశారు. శేషశయ్యపై పురుషోత్తముడైన శ్రీమహావిష్ణువు పవ్వళించివున్నాడు. ఆయన నీలనీరద ఘనశ్యామశరీరంపై పీతాంబరం తటిల్లతా సదృశంగా శోభిస్తుంది. ప్రసన్నవదనుడు అరుణారవిందాయతన నయనుడు సుమనోజ్ఞంగా దర్శనమిచ్చాడు. అనర్ఘరత్నమణి ఖచిత కిరీటాలు దివ్యప్రభలీనుతున్నాయి. అష్టభుజాలతో శ్రీవత్సలాంఛిత వక్షస్థలంతో, కౌస్తుభరత్నహార సహిత వనమాలాలంకృత గళంతో దివ్యదర్శన మిచ్చాడు. నందసునందాది పార్శదులతోపాటు సుదర్శన చక్రాద్యాయుధాలూ పుష్టి, శ్రీ, కీర్తి, మాయలు, అష్టసిద్ధులు, శరీరాలు (ఆకృతులు) ధరించి భగవానుని సేవలో నిమగ్నమయ్యాయి. శ్రీకృష్ణార్జునులు శిరస్సులువంచి సభక్తికంగా ఆత్మరూపుడైన ఆ అచ్యుతునికి ప్రణామం చేశారు. అప్పుడు విష్ణు భగవానుడు, "ఓ నరనారాయణులారా! నా ఆత్మ స్వరూపులైన మీయిరువురిని రప్పించాలనే నేను బ్రాహ్మణ బాలకులను ఇచ్చటికి తెప్పించాను. భూమిమీద మీరుచేయవలసిన

పనిపూర్తయింది. త్వరలో ఇచ్చటికి వచ్చేయండి. మీరు పూర్ణకాములు. లోకకళ్యాణార్థం మార్గదర్శకంగా ధర్మాచరణం చేశారు అన్నాడు. అనంతరం శ్రీకృష్ణార్జునులు బ్రాహ్మణబాలురను వెంటబెట్టుకొని ద్వారకానగరానికి తిరిగి వచ్చారు. అర్జునుడు తన ప్రతిజ్ఞానుసారం ఆబాలకులను బ్రాహ్మణునికి అప్పగించాడు. ఇలా భగవంతుడు తన ప్రియసఖుడైన అర్జునుని ప్రతిజ్ఞనెరవేర్చాడు.

(2)

లాక్షాగృహంలో పాండవులు దగ్ధమయ్యారనే వర్తమానంవిని శ్రీకృష్ణుడు వారిని అన్వేషిస్తూ ద్రౌపదీ స్వయంవరంవద్దకు వచ్చాడు. బ్రాహ్మణవేషధారియైన అర్జునుని బలరామునికి చూపించాడు. పాండవులకు బాసటగా నిలిచి విరోధిరాజన్యులను నిరుత్తరులను చేసి పంపించివేశాడు. దారిద్ర్యపీడితులైన పాండవులను స్నేహమయ పురస్కారాలతో అపారధనాన్నిచ్చి మహాధనికులను చేశాడు.

శ్రీకృష్ణుడు వైడూర్యాలు పొదిగిన ఆభరణాలను, దేశవిదేశాలనుంచి రప్పించిన వస్త్రోపవస్త్రాలూ, శాలువలూ, దుశ్శాలువలూ, మృగచర్మాలూ, దుప్పట్లూ, పట్టుపరుపులు అనేకరకాలైన రత్నములను, బహువిధ విశాలమైన షామియానాలూ, పల్లకీలూ, సవారీలూ, వైడూర్యమణులూ, పచ్చలు పొదిగిన చిత్రవిచిత్రపాత్రలూ సుందర విభూషణాంచిత రూపయౌవన సరస చతురతా సంపన్నులైన దాసీలను, సుశిక్షితము సుందరము అయిన ఏనుగులు, మనోహరాలంకార మండితమైన అశ్వాలు, ధ్వజాలతోడి సువర్ణ రథాలు, కోట్లాది కాంచన నిష్కలూ, గృహావశ్యకమైన ఎన్నో పనిముట్లు, పరికరాలు మిక్కుటముగా బహూకరించినట్లు మహాభారతంలో ఉల్లేఖింపబడినది. తదనంతరము పాండవుల రాజసూయ యాగానికి అనేకవిధాలుగా సహకరించి విజయవంతం చేశాడు. ఆ సందర్భంలో భగవానుడు ఎన్నో సేవలందించాడు. అతిథుల పాదప్రక్షాళనం చేశాడు. ఎంగిలివిస్తళ్ళుకూడా ఎత్తాడని కొందరు వర్ణించారు. ఒక్కటని చెప్పనేల? సర్వవిధకార్యాలు

భగవానుని సహాయసహకార సామర్థ్యాలవల్లనే సఫలమయ్యాయి. అర్జునుని సంతోషంకోసం అన్యరాజుల రీతిగానే శ్రీకృష్ణుడూ పద్నాలుగువేల ఉత్తమగజాలను యుధిష్ఠిరునికి అర్పించాడు.

శ్లో. వాసుదేవోఽపి వార్ష్ణేయో మానం కుర్వన్ కిరీటినః ।
అదదాద్ గజముఖ్యానాం సహస్రాణి చతుర్దశ ॥
(మహాభారతం సభా,52–30,31)

పద్మవ్యూహంలో జయద్రథుని మూలంగా అతిరథ మహారథులంతా కలసి వీరాభిమన్యుని వధించారు. పాండవ శిబిరమంతా శోకంతో, రోదనలతో, ఘూర్ణిల్లింది. ఉత్తరాసుభద్రల విలాపం దుర్భరం, దారుణం. అర్జునుని ప్రార్థనమీద శ్రీకృష్ణుడు సుభద్రను వూరడిస్తూ–

శ్లో. దిష్ట్యామహారథో ధీరః పితృస్తుల్య పరాక్రమః ।
క్షాత్రేణ విధినా ప్రాప్తో వీరాభిలషితాం గతిమ్ ॥

జిత్వా సుబహుశః శత్రూన్ ప్రేషయిత్వా చ మృత్యవే ।
గతఃపుణ్యకృతాం లోకాన్ సర్వకామదుహో ఽక్షయాన్ ॥

తపసా బ్రహ్మచర్యేణ శృతేన ప్రజ్ఞయాపి చ ।
సంతో యాం గతి మిచ్ఛన్తి తాం ప్రాప్తస్తవ పుత్రకః ॥

వీర సూర్వీర పత్నీ త్వం వీరజా వీరబాంధవా ।
మా శుచస్తనయం భద్రే గతః స పరమాం గతిమ్ ॥
(మహాభారతం, ద్రోణ, 77/14–17)

శ్లో. యే చాన్యేఽపి కులే సన్తి పురుషా నో వరాననే ।
సర్వే తే తాం గతిం యాన్తు హ్యాభి మన్యోర్యశ స్వినః ॥
(మహాభారతం, ద్రోణ, 78/41)

"సోదరీ! నీ పుత్రుడు వీరుడు, శూరుడు, మహారథి. తండ్రికి పోటీరాగల పరాక్రమశాలి. క్షత్రియవీరులు నిత్యం ఆకాంక్షించే ఉత్తమగతిని

అతడు పొందాడు. అసంఖ్యాక శాత్రవ వీరులను జయించి మృత్యుసదనానికి పంపి పుణ్యాత్ములు వెళ్లే కామితార్థదాయకమైన అక్షయపదం చేరాడు. తపోబ్రహ్మచర్య, వేదాధ్యయన జ్ఞానాదులద్వారా సత్పురుషులు వాంఛించే పరమపదాన్ని నీ పుత్రుడు వీరమరణంతో పొందాడు. సోదరీ! నీవు వీరమాతవు, వీరపత్నివి, వీర పుత్రివి, వీర భగినివి. నీవు బిడ్డకోసం దుఃఖించకు. నీ పుత్రుడు యుద్ధంలో వీరమరణం పొంది దుర్లభమైన పరమపదం అందుకున్నాడు. మన వంశజులైన పురుషులందరూ యశోవిశాలుడైన అభిమన్యుడు పొందినట్టి శ్రేయోగతి పొందాలని నా వుద్దేశ్యం. నీవు నిశ్చింతగా వుండు. అర్జునుడు రేపు జయద్రథుని వధించి తీరుతాడు" అని పలికి వెళ్ళాడు. అపుడు సుభద్ర కాలగతి చిత్రమైంది. శ్రీకృష్ణుని ఆశీస్సులున్న అభిమన్యుడంతటివాడు రణభూమిలో నేడు అనాథలా దారుణంగా వధింపబడ్డాడు. నాయనా! పుత్రా! యజ్ఞపరుడూ, దానశీలి, బ్రాహ్మణోత్తముడూ, బ్రహ్మచర్యానిష్ఠుడు, పుణ్యతీర్థస్నాతుడు, నిత్యోపకారి, ఉదారుడు, గురుశుశ్రూషా తత్పరుడు. భూరిదక్షిణలిచ్చేవాడు. యుద్ధంలో వెనుజూపక శత్రువులను మర్దించేవాడు. వేలాది గోవులను దానంచేసేవాడు. సామగ్రితోసహా గృహదానం చేసేవాడు. బ్రాహ్మణులకు శరణాగతులకు అపారధనరాశులిచ్చేవాడు, సర్వసంగ పరిత్యాగి, సన్న్యాసి, మౌనవ్రతుడు, పతివ్రత, సత్పురుషుడైనరాజు, ఆశ్రమధర్మపాలకుడు, దీనదయాళువు, సమభాగం పంచేవాడు, ధర్మశీలి, అతిథులను నిరాశపరచనివాడు, ఆపదలో ధైర్యంగలవాడు, మాతాపితృ భక్తుడు స్వస్త్రీపరాయణుడు, పరస్త్రీదూరుడు, భార్యతో ఋతుకాలంలో సంగమించేవాడు, మదమాత్సర్యం లేనివాడు, క్షమావంతుడు, పరుషముగా మాటాడని వాడు, మద్యమాంసదూరుడు, సత్యశీలి, నిగర్వి, నిరహంకారి, పరులకప్రియం చేయనివాడు, పాపకార్యలజ్జితుడు, శాస్త్రవేది, పరమాత్మజ్ఞాన సంపన్నుడు, నిత్య సంతుష్టుడు, జితేంద్రియుడు, మొదలయిన యోగ్యులు పొందే ఉత్తమగతి నీకు ప్రాప్తించుగాక!" అని ఆశించింది ధన్యురాలయిన ఆ వీరమాత.

శ్రీకృష్ణునిపై భారమువేసి అర్జునుడు జయద్రథుని వధిస్తానని శపథం చేస్తూ సుభద్రతో పలికెను, "జయద్రథుడు నన్నో, యుధిష్ఠిర

ప్రభువునో, శ్రీకృష్ణభగవానునో శరణాగతుడుగా వేడిన పక్షంలో రేపు సూర్యాస్తమయం కాకపూర్వమే అతనిని సంహరించి వేస్తాను. అలా చేయనిచో నేను వీరుల గతిని, పుణ్యాత్ముల గతిని పొందనివాడను. అంతేకాదు మాతృహంత, పితృహంత, గురుపత్నీగామి, దుష్టుడు, సాధుజన పరజన నిందాపరుడు, గృహదహనకుడు, కృతఘ్నుడు, పరస్త్రీలోలుడు, గోబ్రాహ్మణ హంతకుడు, వేదాధ్యయనము చేసినవారిని సువ్రతులను దూషించే వాడు, వృద్ధులను, సాధువులను, గురువులను మన్నించనివాడు. గోబ్రాహ్మణాగ్నులను కాలితో తన్నినవాడు, నీటిలో ఉమ్మి వేసేవాడు, నీటిలో మలమూత్రాలు విసర్జించేవాడు, దిసమొలతో స్నానంచేసేవాడు, అతిథులను నిరాశపరచేవాడు, స్త్రీ, పుత్ర, పరివారక, ఆశ్రితులకు పెట్టక తానే భుజించేవాడు, హితైషులైన సత్పురుషులను అలక్ష్యం చేసేవాడు, ఉపకారిని నిందించేవాడు, నిర్దయుడు, మదిరాలోలుడు, మర్యాదాభంజకుడు, భరించి పోషించే వారిని తృణీకరించేవాడు, ఎడమచేతిని ఒడిలో పెట్టుకొని అన్నంతినేవాడు, ధర్మదూరుడు, ఉషఃకాలంలో నిద్రించేవాడు, చలికిజడిసి స్నానంచెయ్యనివాడు, యుద్ధపలాయితుడైన క్షత్రియుడు. వేదాధ్యయనం లేని ఊరిలోనూ, ఒకే నుయ్యి ఉన్న ఊరిలో ఆర్నెల్లు ఉన్నవాడు, పగలునిద్ర పోయేవాడు, శాస్త్రనిందచేసేవాడు, దివామైథునలోలుడు, గృహదహనం చేసేవాడు, విషంపెట్టేవాడు, అగ్ని, అతిథి లేనివాడు, గోవును నీళ్ళుత్రాగనివ్వనివాడు, ఋతుకాలంలో మైథునం చేసేవాడు. కన్యావిక్రేత, దానం చేస్తానని లోభంతో మానినవాడు— మొదలైన పాపులు ఏయే ఘోరనరకాల పాలవుతారో ఆయా నరకాలకు పోతాను*. అంతేకాదు జయద్రథుని నేను వధించకపూర్వమే సూర్యాస్తమయం అయితే నేను ప్రజ్వలిత అగ్నిగుండంలోకి దూకి ప్రాణాలు విడుస్తాను" అని అర్జునుడు అన్నాడు. అర్జునుని ప్రతిజ్ఞ వింటూనే శ్రీకృష్ణుడు పాంచజన్యాన్ని నోటితో వూదాడు.

---

*సుభద్రార్జునులు ప్రసంగవశాన పల్కిన పుణ్యకర్మలను, పాపకర్మ తెలుసుకొని పాపకర్మలను త్యజించి, పుణ్యకర్మలను పాఠ ఆచరింతురుగాక! — సంపాదకుడు.

ఆ భీషణ ఘోషకు భూమ్యాకాశ పాతాళాదిలోకాలన్నీ ప్రళయకాలంలోలా భీతావహంగా ప్రకంపించాయి.

-----oOo-----

శ్రీకృష్ణుడు ఏకాంతంగా అర్జునునితో "సఖా! నేను గూఢచారులద్వారా సమాచారం సేకరించాను. నీ ప్రతిజ్ఞ వింటూనే జయద్రథాదులు భయాందోళన పొందిరి. అయినా ద్రోణాచార్య సహితంగా ఆరుగురు మహారథులు జయద్రథుని కంటికి రెప్పలా కాపాడాలని తీర్మానం చేశారు. ఆ ఆరుగురిని జయించకుండా జయద్రథుడు దొరకడం కష్టం. నన్ను సంప్రదించకుండానే భీషణ ప్రతిజ్ఞ చేశావు" అన్నాడు. అపుడు అర్జునుడు,"భగవాన్! నాకు ఆ మహారథులగురించి బెంగలేదు. నేనందరినీ నిర్జించగలను-

శ్లో. తవ ప్రసాదాద్భగవన్ కిమివాస్తి రణే మమ ॥
(మహాభారతం , ద్రోణపర్వం 76-21)

"ఓ భగవాన్! నీ కరుణవుంటే యుద్ధంలో అసాధ్యం ఏం ఉంటుంది?" అన్నాడు. స్వయంగా జయద్రథుడూ దుర్యోధనునితో ఇదేవిధంగా అన్నాడు.

శ్లో. వాసుదేవసహాయస్య గాండీవం ధున్వంతో ధనుః ।
కోఽర్జునాగ్రతస్తిష్ఠేత్సాక్షాదపి శతక్రతుః ॥
(మహాభారతం, ద్రోణపర్వం, 75-20)

"వాసుదేవుని సహాయంలో గాండీవధారి అయిన అర్జునుడు మహేంద్రునైనా నిల్వరించగలడు. అతనికి ఇంక అసాధ్యమేముంటుంది".

వాస్తవానికి జరిగిందీ అదే, శ్రీకృష్ణుని వల్లనే పాండవులు యుద్ధంలో గెలుపొందారు. కృష్ణుడూ సర్వమూ ముందుగానే సన్నద్ధం చేసివుంచుతాడు. ఎక్కడ, ఎలా, ఏమిచేస్తే అర్జునుని ప్రతిన, ప్రాణం, ప్రతిష్ఠ నిలుస్తాయో అవన్నీ శ్రీకృష్ణుడే చూచుకుంటాడు. ప్రతిదీ శ్రీకృష్ణుడు

దూరదృష్టితో సిద్ధంచేసి పెడతాడు. సర్వమూ శ్రీకృష్ణునికే వదిలేసి అర్జునుడు నిశ్చింతగా ఉంటాడు. తన రథాశ్వాల కళ్లాన్ని శ్రీకృష్ణునికి అప్పగించి "మాశుచః" అని ఆయన అభయం పొందిన అర్జునునికి ఇకచింతతో పనియేమిటి? చింతలన్నీ తీర్చే సర్వాంతర్యామి ఉండనే ఉన్నాడు గదా!.

మరునాడు ఘోరసంగ్రామంజరిగింది. శత్రువీరులను చెండాడుతూ కౌరవసేన సముద్రాన్ని మథిస్తూ ఆరుగురు మహారథులు పరిరక్షిస్తున్న జయద్రథుని చేరడం అశక్యమయింది. అపుడు కృష్ణుడు "మిత్రమా! వీరందరినీ జయించి సూర్యాస్తమయంలోపు జయద్రథునిని వధించడం దుష్కరం. నేను మరో మార్గం చూపుతాను" అని—

శ్లో. యోగీయోగేన సంయుక్తో యోగినామీశ్వరో హరిః ।
సృష్టేతమసి కృష్ణేన గతోఽస్త మితి భాస్కరః ॥
(మహా, ద్రోణ, 146/68)

యోగేశ్వరేశ్వరుడైన శ్రీహరి సూర్యుని క్రమ్మివేసేటంత ఘోరాంధకారాన్ని సృష్టించాడు. ఆ చీకట్లో సూర్యాస్తమయం అయిపోయినట్లయింది. ప్రొద్దుగ్రుంకిందని కౌరవప్రముఖులు హర్షంతో జయజయధ్వానాలు చేశారు. జయద్రథుడు సంతోషముతో బయటకు వచ్చి ఆకాశమువైపు చూడసాగెను. కృష్ణుడపుడు— "అర్జునా! ఇదే తగిన సమయము నిశితశరంతో జయద్రథుని శిరస్సు ఖండించి శపథం నెరవేర్చుకో" అన్నాడు. అర్జునుడు బాణం సంధించాడు. జయద్రథుడు పరివేష్టించిన మహారథులు నిర్వీణ్ణులయ్యారు. తన శరపరంపరలతో కిరీటి మహారథులను రక్తస్నానం చేయించాడు. ఇంతలో భగవానుడు అంధకారమును మటుమాయం చేశాడు. పడమటి దెసకు వాలుతున్న భానుబింబం కనిపించింది. కృష్ణుడు వెంటనే—" అర్జునా! త్వరపడు, జాగ్రత్త జయద్రథుని శిరస్సు నేలతాకిందో వానితండ్రి శాపంగా, అలా పడగొట్టిన వాడి మస్తకం వేయిముక్కలవుతుంది".

శ్లో. ధరణ్యాం మమ పుత్రస్య పాతయిష్యతి యః శిరః ।
తస్యాపి శతథా మూర్ధా ఫలిష్యతి న సంశయః ॥
(మహాభారతం, ద్రోణపర్వం–146–112)

అందుకని నీవు తెగిన వానితలను నీ దివ్యాస్త్రప్రభావంతో పైపైకి లేపి సంధ్యావందన మాచరించే అతని ముదుసలితండ్రి ఒడిలో పడవెయ్యి!" అన్నాడు. అర్జునుడు కృష్ణుడు చెప్పినట్లే జయద్రథుని శిరస్సు ఖండించి దివ్యాస్త్రాలతో ఆకాశమార్గంగుండా దానిని నడిపించి అతని తండ్రి ఒడిలో పడేటట్లు చేశాడు. ఒడిలోపడ్డ తలను కంగారుపడి అతని తండ్రి విదిలించి విసిరివేసాడు. తక్షణం అతని తలవేయివ్రక్కలయింది. భగవానుని దూరదృష్టివలన అర్జునుడు రెండు విపత్తులనుండి అద్భుతముగా ప్రాణాన్ని రక్షించుకోగలిగాడు.

## (4)

కర్ణునివద్ద ఇంద్రుడిచ్చిన అమోఘశక్త్యాయుధం ఉంది. ప్రాణాపన్న సమయంలో దానిని ఉపయోగించాలి. అది ఎంతటి శత్రువీరుడినైనా హతమారుస్తుంది. అయితే దాని ప్రభావం ఒకే ఒక్కసారి ఫలిస్తుంది. కర్ణుడాశక్తిని అర్జునుని మీద ప్రయోగించడానికి దాచివుంచాడు. దుర్యోధనుడు దానితో అర్జునుని వధించమంటూ ఉండేవాడు. అర్జునుడు యుద్ధంలో తనకెదురైనప్పుడు తానాశక్త్యాయుధాన్ని ప్రయోగిస్తానని కర్ణుడనేవాడు. కాని అర్జునుడెదురయినప్పుడల్లా కర్ణుడు తన దగ్గరున్నశక్తిని మర్చిపోయేవాడు. దానికి కారణం శ్రీకృష్ణుడే. కర్ణునికి అర్జునుని రథం ఎదురైనప్పుడు ముందుగా అతనికి సారథియైన శ్రీకృష్ణుడు కనపడేవాడు. శ్రీకృష్ణుడతనిని సమ్మోహపరిచేవాడు. సర్వావస్థలలో అర్జునుని ప్రాణరక్షణార్థం శ్రీకృష్ణుడు అత్యంత జాగరూకుడై ఉండేవాడు. కృష్ణుడు సాత్యకితో స్వయంగా–

**శ్లో. అహమేవ తు రాధేయం మోహయామి యుధాం వర ।**
**తతో నానాసృజచ్ఛక్తిం పాండవే శ్వేతవాహనే ॥**

న పితా న చ మే మాతా న యూయం భ్రాతరస్తథా ।
న చ ప్రాణాస్తథా రక్ష్యా యథా బీభత్సురాహవే ॥

త్రైలోక్యరాజ్యాద్యత్కించిద్భవే దన్యత్సుదుర్లభమ్ ।
నేచ్ఛేయం సాత్వతాహం తద్వినా పార్థం ధనంజయమ్ ॥
(మహాభారతం, ద్రోణపర్వం, 182/40,43,44)

"సాత్యకీ! ఇంద్రదత్త శక్త్యాయుధం ప్రయోగించి అర్జునుని కర్ణుడు చంపకుండా ఉండేందుకు, కర్ణుని నేను సమ్మోహితుని చేసేవాడిని. నేను మాతాపితరులనుగాని, మిమ్ములనుగాని, సోదరులనుగాని, చివరకు నా ప్రాణాలనుగాని అర్జునుని ప్రాణరక్షణంకంటే అధికంగా భావించను. సాత్యకీ! త్రైలోక్యరాజ్యాధిక పదవినైనా విడిచిపెడతాను గాని అర్జునుని విడువజాలను" అన్నాడు. అర్జునుడెంత ధన్యుడో!.

అందుచేతనే భీమపుత్రుడైన ఘటోత్కజుని రాత్రిసమయమందు యుద్ధానికి కృష్ణుడు పంపించాడు. తన రాక్షసమాయ ప్రయోగించి ఘటోత్కజుడు కౌరవసైన్యాన్ని మట్టుబెడుతూ కర్ణునికి ప్రాణాంతకమయ్యాడు. దుర్యోధనాదులు మిక్కిలి ఆందోళనచెందారు. వారంతా ఖిన్నులై కర్ణునితో ఈ అర్ధరాత్రి యీరాక్షసుని చేతిలో మేముచావడం నిశ్చయం. ఇంకా భీమార్జునుల యుద్ధంతో పనిలేదు. నీవు వెంటనే ఇంద్రదత్తశక్తిని ప్రయోగించి మా అందరిప్రాణాలు రక్షించు" అని అరిచారు. చివరికి కర్ణుడు ఘటోత్కజునిపై శక్తిని ప్రయోగించాడు. తక్షణం ఘటోత్కచుడు మరణించాడు. ఘటోత్కచ వీరకుమారుని మరణంతో పాండవులందరూ దుఃఖించారు. కాని శ్రీకృష్ణుడు సంతోషపరవశుడై పదేపదే అర్జునుని హృదయానికి హత్తుకున్నాడు. అపుడు అర్జునుడు–"ఏమిటీ విడ్డూరం? మేమంతా విచారిస్తుంటే నీవు ఆనందిస్తున్నావు?" అన్నాడు. కృష్ణుడు రహస్యం వివరించాడు– "సఖా! నీకు మేలుచేయాలని ఇంద్రుడు కర్ణుని కవచకుండలాలు గ్రహించి, వాటికి మారుగా అతనికి శక్తినిచ్చాడు. కర్ణుడాశక్తిని నీపై ప్రయోగించడానికి దాచుకున్నాడు. కర్ణుని దగ్గర ఆ శక్తి ఉన్నంతవరకూ నీ ప్రాణాలకు రక్షణలేదు. నిజంచెపుతున్నాను. కర్ణుని దగ్గర ఇప్పుడు శక్తిలేకపోయినా అతనిని నీవుతప్పమరొకడు వధించలేడు. అతడు

బ్రాహ్మణభక్తుడు. సత్యవాది, తపస్వి, సువ్రతుడు, శత్రువుల పట్లసైతం సానుభూతి చూపుతాడు. అందుకే నేను ఘటోత్కచుని పంపించాను. అర్జునా! నీకోసం ఇదంతా చేశాను. చేదిభూపాలుడు శిశుపాలుని, భిల్లుడు ఏకలవ్యుని, జరాసందాది వివిధరణకుశలురను చంపిందీ, చంపింపచేసిందీ వారు మహాభారతసంగ్రామంలో కౌరవపక్షం వహిస్తారనే. ఇప్పుడు వారే జీవించి వుంటే నీ సంగ్రామ విజయం మహాదుర్లభం. మరి యీ ఘటోత్కచుడో బ్రాహ్మణద్వేషి, యజ్ఞద్వేషి, ధర్మద్రోహం చేయగల పాప స్వభావుడు. నేను అతనిని వధిస్తే మీకు బాధ కలుగుతుంది. అందుకే నేను చంపలేదు. ఈ రోజు నేనే అతనిని వధింపజేశాను.

శ్లో. యే హి ధర్మస్యలోప్తారో వధ్యాస్తే మమ పాండవ ।
ధర్మసంస్థాపనార్థం హి ప్రతిజ్ఞైషా మమావ్యయా ॥

బ్రహ్మ సత్యం దమః శౌచం ధర్మో హ్రీః శ్రీర్ధృతిః క్షమా ।
యత్ర తత్ర రమే నిత్యమహం సత్యేన తే శపే ॥
(మహాభారతం, ద్రోణపర్వం, 181–28,30)

"ఎవడు ధర్మానికి హాని చేస్తాడో, వానిని నేను అంతం చేస్తాను. ధర్మసంస్థాపనమే నా స్థిరప్రతిజ్ఞ. బ్రహ్మణ్యం, సత్యం, ఇంద్రియ దమనం, శౌచం, ధర్మ, అధర్మ సంకోచం, శ్రీ, ధైర్యం, క్షమ ఎక్కడుంటాయో అక్కడ నేనుంటాను ఇది నా శపథం" అన్నాడు.

"నీలో ఆ సుగుణాలున్నాయి. అందుకే నేను నీతో ఉన్నాను. నాకు మీరెంతో కౌరవులూ అంతే. కౌరవపక్షంలో నేను ఉండక పోవడానికీ, మీ పక్షంలో ఉండటానికి గలకారణం ఇదే. ఘటోత్కచుని కోసం విలపించవద్దు. పాపాత్ముడు స్వంత తమ్ముడైనా వర్జించడం ధర్మం"

ఈ విధంగా భగవానుడు అర్జునుని ప్రాణాలను ధర్మాన్ని రక్షించాడు.

(5)

జయద్రథుని వధించేరోజున అర్జునుని రథాశ్వాలు బాగా అలసిపోయాయి. ఒళ్ళంతా గాయాలే. దాహంతో వాటికి ప్రాణాలు కళ్లల్లోకి వచ్చాయి. జయద్రథుడు ఇంకా అందనంతదూరంగా ఉన్నాడు. శ్రీకృష్ణుడు గుర్రాలను రథంనుంచి వేరుచేశాడు. అర్జునుడు రథందిగి గాండీవం పట్టుకొని దృఢంగా నిలిచి బాణాలతో చక్కని చెరువు త్రవ్వాడు. బాణాలతోనే స్తంభాలు, భవనం, ప్రహారీని నిర్మించాడు. శ్రీకృష్ణుడు గుర్రాలకు గుచ్చుకున్న బాణాలు లాగేసి, శుభ్రంగా గాయాలూ, ఒళ్లూ కడిగి నీళ్ళు పెట్టాడు. నీరుత్రాగి, జలకమాడి, పచ్చికమేశాక వాటికి మళ్ళీ ఉత్సాహం వచ్చింది. అప్పుడు వాటిని శ్రీకృష్ణుడు రథానికి కట్టాడు. ఇలా మిత్రుని సేవలో భగవంతుడు ఏలోటు చేయలేదు.

(6)

కర్ణార్జునులు హోరాహోరీగా పోరాడుతున్నారు. శల్యకర్ణసంవాదం విని అర్జునుడు కృష్ణుని "యుద్ధంలో కర్ణుడు నన్ను వధిస్తే ఏంచేస్తా"వని ప్రశ్నించాడు. దానికి శ్రీకృష్ణుడు—

శ్లో. పతేద్దివాకరః స్థానాచ్ఛుష్యేదపి మహోదధిః ।
శైత్య మగ్నిరియాన్న త్వాం హన్యాత్ కర్ణో ధనంజయ ॥

యది చైతత్కథంచిత్స్యాల్లోకపర్యాసనం భవేత్ ।
హన్యాం కర్ణం తథా శల్యం బాహుభ్యామేవ సంయుగే ॥
(మహాభారతం, కర్ణపర్వం, 87–105,106)

"ధనంజయ! సూర్యుడు విరిగిపడిపోయినా, సముద్రాలు ఇంకిపోయినా, అగ్ని చల్లబడినా కూడ కర్ణుడు నిన్ను చంపలేడు. కర్ణుడు నిన్ను చంపడమే తటస్థిస్తే లోకం తలక్రిందులవుతుంది. అప్పుడు నేనే నా చేతులతో కర్ణుని, శల్యుని చంపివేస్తాను" అన్నాడు.

కర్ణుడు అర్జునుని చంపడానికి చిరకాలంగా సర్పముఖాస్త్రాన్ని

దాచివుంచాడు. అది మహా భయంకరమైంది. తీవ్రమైంది. నిప్పులు క్రక్కుతూ వెళ్ళి శత్రువును తక్షణం భస్మం చేస్తుంది. కర్ణుడు సర్పముఖాస్త్రాన్ని సంధించాడు. ఆకాశంతో పాటు అన్నిదిక్కులా మంటలు చెలరేగాయి. వందలాది నక్షత్రాలు పగటిపూటే రాలి పడ్డాయి. ఇంద్రునితో సహా లోకపాలకులందరూ హాహాకారాలు చేశారు. ఖాండవదహనం సందర్భంగా అశ్వసేనుడనే భయంకర విషసర్పం అర్జునునితో వైరం పెంచుకుంది. ప్రతీకారేచ్ఛతో, సర్పముఖాస్త్రంలో ప్రవేశించింది. శ్రీకృష్ణుడు చాకచక్యంగా ఆబాణం అర్జునుని చేరకముందే బరువైన అర్జునుని రథాన్ని పాదంతో గట్టిగా క్రిందికి త్రొక్కాడు. గుర్రాలు మోకాళ్ళమీదికి వంగిపోయినవి. అర్జునుని తలకు తగలవలసిన బాణం ఇంద్రదత్త కిరీటానికి తగిలింది. అది నేలమీదపడి భగ్గునమండిపోయింది. శ్రీకృష్ణుడు నిశ్చేష్టుడైన అర్జునుని తట్టి ఆ అశ్వసేన సర్పాన్ని చూపి దానిని చంపించి వేశాడు. అటువంటి ప్రాణాంతకమైన ప్రమాదంనుంచి శ్రీకృష్ణుడు అర్జునుని రక్షించాడు.

(7)

భారతయుద్ధంలో పాండవులు విజయులయ్యారు. కృష్ణార్జునులు రథంమీద రాజప్రాసాదాన్ని సమీపించారు. కృష్ణుడు అర్జునునితో –"భరతవంశోత్తమా! గాండీవాన్ని అక్షయతూణీరయుగ్మాన్ని తీసుకొని నీవుముందుగా రథం దిగిపో. నేను తర్వాత దిగుతాను. అదేనీకు శుభప్రదం అన్నాడు. అదోక్రొత్త పద్ధతి. అయినా భగవానుని ఆజ్ఞానుసారం అర్జునుడు రథం దిగిపోయాడు. పిమ్మట జగదీశ్వరుడైన శ్రీకృష్ణభగవానుడు కళ్లెం వదిలిపెట్టి రథంమీంచి దిగాడు. శ్రీకృష్ణుడు దిగిపోగానే రథధ్వజం మీది హనుమంతుడు అదృశ్యమయ్యాడు. వెంటనే అంతపెద్ద రథమూ, గుర్రాలతో సహా తగలబడి బూడిదైపోయింది. చూచిన వారంతా నిశ్చేష్టులయ్యారు. అర్జునుడు పరమాత్మునికి అంజలి ఘటించి కారణం అడిగాడు. శ్రీకృష్ణుడు–

శ్లో. అస్త్రైర్బహువిధై ర్దగ్ధః పూర్వమేవాయమర్జున ।
మదధిష్ఠితత్వాత్ సమరే న విశీర్ణః పరంతప ॥

ఇదానీం తు విశీర్ణోఽయం దగ్ధో బ్రహ్మాస్త్రతేజసా ।
మయా విముక్తః కౌన్తేయ త్వయ్యద్య కృతకర్మణి ॥
(మహాభారతం, శల్యపర్వం–62–18,19)

"ఓ పరంతపా! వివిధశస్త్రాస్త్రాలతో యీ రథం ఇదివరకే దగ్ధమయింది. దీనిపై కూర్చుని నేను ఆపటంచేత యుద్ధసమయంలో ఇది బూడిదగా మారలేదు. కౌంతేయా! నీ పని ముగించిన తర్వాత దీనిని వదిలేశాను. అందుచేత బ్రహ్మాస్త్రసమప్రకాశంతో ఇది యిప్పుడలా భస్మీపటలం అయ్యింది. నేను ఇదివరకు ఆపకపోయినా, ఇప్పుడు నేను ముందే దిగిపోయినా యిది బూడిదయ్యేదే" అన్నాడు.

భగవానుని లీలలను దర్శించి పాండవులు ఆనందపరవశులయ్యారు. మహాభారతంలోను పురాణాల్లోనూ శ్రీకృష్ణార్జునుల మైత్రీబంధానికి సంబంధించిన అనేక ఉదాహరణలు గోచరిస్తాయి. ఇక్కడ సంక్షిప్తంగా కొన్ని మాత్రమే ఉదాహరించడం జరిగింది. ఇంకా యిటువంటి లీలలను తెలుసుకోదలిచినవారు అన్యగ్రంథాలు చదవాలి. వినాలి.

అశ్వత్థామ ఉత్తరాగర్భస్థశిశువు పరీక్షిత్తును చంపేశాడు. ఉత్తర శ్రీకృష్ణుని ఎదుట గర్భశోకంతో ఏడ్చింది. ఆ సమయంలో యావత్ జగత్తును ఉద్దేశించి శ్రీకృష్ణుడు:–

శ్లో. న బ్రవీమ్యుత్తరే మిథ్యా సత్యమేతద్భవిష్యతి ।
ఏష సంజీవయామ్యేనం పశ్యతాం సర్వదేహినామ్ ॥

నోక్తపూర్వం మయా మిథ్యా స్వైరేష్వపి కదాచన ।
న చ యుద్ధాత్పరావృత్తస్తథా సంజీవతామయమ్ ॥

యథా మే దయితో ధర్మో బ్రాహ్మణాశ్చ విశేషతః ।
అభిమన్యోః సుతో జాతో మృతో జీవత్వయం తథా ॥

యథాహం నాభిజానామి విజయేన కదాచన ।
విరోధం తేన సత్యేన మృతో జీవత్వయం శిశుః ॥

యథా సత్యం చ ధర్మశ్చ మయి నిత్యం ప్రతిష్ఠితౌ ।
తథా మృతః శిశురయం జీవతాదభిమన్యుజః ॥

యథా కంసశ్చ కేశీ చ ధర్మేణ నిహతౌ మయా ।
తేన సత్యేన బాలోఽయం పునః సంజీవతామయమ్ ॥
(మహాభారతం, అశ్వమేధపర్వం, 69–18–23)

"ఓ ఉత్తరా! నేను అసత్యము పలుకను. నా మాటసత్యం. ఈ మృత శిశువును నేను బ్రతికిస్తాను. శరీరధారులు అంతా గ్రహిస్తారుగాక! నేను నవ్వులాటకైనా అబద్ధం ఆడని వాడనైతే, యుద్ధంలో వెన్నుచూపని వాడనైతే యీ బిడ్డ జీవించుగాక! నాకు ధర్మము, బ్రాహ్మణులు, ప్రీతిపాత్రులైతే అభిమన్యుకుమారుడైన యీ మృతశిశువు జీవించుగాక! నేను అర్జునునితో ఎన్నడూ వైరం తలపెట్టక పోవడం సత్యమైతే ఈ శిశువు జీవించుగాక! నా హృదయాంతరంలో సత్యంధర్మాలు సుప్రతిష్ఠితమైవుంటే వాటి ప్రభావంతో మృతుడైన అభిమన్యపుత్రుడు జీవించుగాక! కంసుణ్ణి, కేశిని నేను ధర్మవిహితంగా (ద్వేషంతోగాక) వధించడం నిజమే అయితే యీబాలుడు బ్రతుకుగాక!" అన్నాడు. భగవానుడు ఈ విధంగా పలుకగానే వెంటనే మృతశిశువు జీవించాడు.

ఈ సందర్భంలో భగవానుని సత్యము, వీరత్వము, ధర్మము బ్రహ్మణ్యత, రాగద్వేషాది రాహిత్యమూ మాత్రమేగాక అర్జునుని పట్లస్వచ్ఛమైన మైత్రికూడ ప్రకటితమయ్యాయి. అర్జునునిపై భగవానుని కెంతో అపారస్నేహ వాత్సల్యం!

అలాగే భక్త సుధన్వుని వధించడానికి ప్రతిజ్ఞబూనితే కృష్ణుడు అర్జునుని రక్షించి అతని ప్రాణాలు కాపాడాడు.

గృహస్థుడైనా అర్జునుడు జితేంద్రియుడు కావడానికి కారణం అతడు శాస్త్రరీత్యా బ్రహ్మచారికావడమే. బ్రహ్మచర్య వ్రతదీక్షాపరుడు సత్యసదాచార సంపన్నుడు అయినందువల్లనే బ్రహ్మాస్త్రాన్ని మరలించగలశక్తి అర్జునునికి ప్రాప్తించింది. అశ్వత్థామ బ్రహ్మాస్త్రం ప్రయోగించాడు. దానిని నిల్వరించడానికి అర్జునుడు కూడా బ్రహ్మాస్త్రాన్నే ప్రయోగించాడు. బ్రహ్మాస్త్రాలు రెండూ స్పర్ధించి జగత్ ప్రళయభీకరంగా పోరాడుతున్నాయి. దివ్య ఋషులు దిగివచ్చి బ్రహ్మాస్త్రాలను ఉపసంహరింపుమని అర్జునుని అడిగారు. లోకకళ్యాణార్థం అర్జునుడు వీటిని ఉపసంహరించాడు. అపుడు వ్యాసమహర్షి ముల్లోకాలలోనూ బ్రహ్మాస్త్రాన్ని ఉపసంహరించగల మహాపురుషుడు అర్జునుడొక్కడే. దేవేంద్రుడు కూడా బ్రహ్మాస్త్రాన్ని ఉపసంహారం చేయలేడు. దుశ్శీలుడు బ్రహ్మాస్త్రప్రయోగమే చేయలేడు. కేవలం బ్రహ్మచారికూడా ఉపసంహారం చేయలేడు. అర్జునుడు బ్రహ్మచారి, సత్యవ్రతుడు, మహావీరుడు గురువాజ్ఞను అతిక్రమించనివాడు. అందుచేతనే అశక్యాన్ని శక్యం చేయగలిగాడు" అన్నాడు.

అర్జునునిలో సుగుణాలు ఒకదాన్ని మించి మరొకటి పుష్కలంగా ఉన్నాయి. కారణం అతడు శ్రీకృష్ణుని అనన్యభక్తుడు కావడమే. అర్జునుని పనినెరవేరేంత వరకూ శ్రీకృష్ణుడు సర్వవిధాలా ప్రయత్నిస్తాడు. ఆయనకు అర్జునుని మీద అంత స్నేహభావం. నిజానికి కృష్ణార్జునులు అభిన్నులు. వారిమధ్య ఏవిధమైన విభేదంలేదు. ఈ విషయాన్ని ఏకగ్రీవంగా వారి విరోధులే అంగీకరించారు. మహారాజు ధృతరాష్ట్రునితో దుర్యోధనుడు పాండవుల రాజసూయయాగాన్ని వర్ణిస్తూ—

శ్లో. ఆత్మా హి కృష్ణః పార్థస్య కృష్ణస్యాత్మా ధనంజయః ।
యద్ బ్రూయాదర్జునః కృష్ణం సర్వం కుర్యాదసంశయమ్॥

కృష్ణో ధనంజయస్యార్థే స్వర్గలోకమపి త్యజేత్ ।
తథైవ పార్థః కృష్ణార్థే ప్రాణానపి పరిత్యజేత్ ॥
(మహాభారతం, సభాపర్వం, 52–31,33)

"శ్రీకృష్ణుడు అర్జునుని ఆత్మ. అర్జునుడు శ్రీకృష్ణుని ఆత్మ. అర్జునుడు శ్రీకృష్ణునికోసం ఏమేమి చేస్తాడో, అవన్నీ శ్రీకృష్ణుడు అర్జునుని కోసం నిస్సందేహంగా చేస్తాడు. శ్రీకృష్ణుడు అర్జునుని కోసం దివ్యలోకాన్ని సైతం త్యాగంచేస్తాడు. అలాగే అర్జునుడు శ్రీకృష్ణునికోసం ప్రాణాలనుకూడా పరిత్యజిస్తాడు" అన్నాడు.

కృష్ణార్జునులు ఒకరికొకరు బహిర్ప్రాణం. వారి పరస్పరప్రేమ పరమస్వచ్ఛమైంది. శ్రీకృష్ణునికి అర్జునుని మీద ఎంత అనురాగమో తెలుసుకోవడానికి యీక్రింది ఉదాహరణచూస్తేచాలు.

పాండవుల దగ్గరనుంచి వచ్చిన సంజయుడు ధృతరాష్ట్రునితో అక్కడి సమాచారాలు వివరిస్తూ కృష్ణార్జునులలో విశిష్టమైన ప్రేమభావం గోచరించింది. వారిరువురితో మాట్లాడేందుకు నేను వారి అంతఃపురంలోకి ఎంతో వినయంగా వెళ్ళాను. ఆమహాత్ములు దివ్యవస్త్రభూషాలంకృతులై రత్నఖచిత సువర్ణాసనాలపై ఆసీనులై యున్నారు. అర్జునుని ఒడిలో శ్రీకృష్ణుని పాదాలున్నాయి. అర్జునుని పాదం ఒకటి ద్రౌపది ఒడిలోనూ మరొకటి సత్యభామ ఒడిలోనూ ఉన్నాయి. అర్జునుడు తన స్వర్ణపాదపీఠిని ముందుకుత్రోసి దానిమీద నన్ను కూర్చోమన్నాడు. నేను దానిని, కళ్ళకద్దుకొని వినయంగా క్రింద కూర్చున్నాను. అపుడు శ్రీకృష్ణుడు అర్జునుని ప్రశంసిస్తూ అతడు తనతో సమానుడని నాతో –

శ్లో. దేవాసురమనుష్యేషు యక్షగంధర్వభోగిషు ।
న తం పశ్యామ్యహం యుద్ధే పాండవం కభ్యయాద్రణే ॥

బలం వీర్యశ్చ తేజశ్చ శీఘ్రతా లఘుహస్తతా ।
అవిషాదశ్చ ధైర్యశ్చ పార్థాన్నాన్యాత్ర విద్యతే ॥
(మహాభారతం, ఉద్యోగపర్వం 50–26,29)

"దేవ, గంధర్వ, యక్ష, రాక్షస, నాగ, మనుష్యులలో అర్జునుని రణంలో ఎదుర్కొగల యోధుడులేడు. బలవీర్యపరాక్రమాలలోనూ శీఘ్రత్వలాఘవత్వాలలోనూ, నిర్విషణ్ణతా, ధీరత్వాలలోను అర్జునునికి

సాటిరాగల మరోమనుష్యుడు లేడు. ఆ సుగుణాలన్నీ అర్జునునిలో ఒక్కుమ్మడిగా మూర్తీభవించి ఉన్నాయి. అతనికతడే సాటి" అన్నాడు.

అర్జునుని మీద శ్రీకృష్ణభగవానునికి సఖ్యప్రేమ. ఆయన దివ్యలీలల్లో సైతం అర్జునుడు తోడు చేసుకున్నాడు. భగవానుడు పరమపదం చేరాక అర్జునుడు జీవచ్ఛవంలా హిమాలయాలకు వెళ్ళి శరీరాన్ని త్యజించాడు. భగవానునియందు అర్జునునికిగల గాఢప్రేమ కారణంగానే అతడు ప్రప్రథమ సర్వోత్తమ గీతాశ్రోత, జ్ఞాతా అయినప్పటికి పరంధామంలో సాయుజ్యముక్తిని స్వీకరించక భగవత్సేవలోనే ఉండిపోయాడు. స్వర్గారోహణానంతరం యుధిష్ఠిరుడు దివ్యదేహం ధరించి పరంధామంలో గమనించింది.

శ్లో. దదర్శ తత్ర గోవిందం బ్రాహ్మేణ వపుషాన్వితమ్ ।
x – x – x – x
దీప్యమానం స్వవపుషా దివ్యైరస్త్రైరుపస్థితమ్ ॥
చక్రప్రభృతి భి ర్ఘోరైర్దివ్యైః పురుషవిగ్రహైః ।
ఉపాస్యమానం వీరేణ ఫాల్గునేన సువర్చసా ॥
(మహాభారతం, స్వర్గారోహణపర్వం, 4/2–4)

శ్రీకృష్ణభగవానుడు బ్రహ్మశరీరంతో ఉన్నాడు. ఆయన శరీరం దేదీప్యమానంగా ఉంది. చక్రాది ఘోరదివ్యాస్త్రాలు పురుషాకారాలు ధరించి ఆయనను సేవిస్తున్నాయి. తేజశ్శాలి, మహావీరుడు అయిన అర్జునుడు ఆయన సేవలో ఉన్నాడు. ఇది ధర్మరాజు చూచిన దృశ్యం.

"మనమంతా లోకంలోని భోగవిషయాలను త్యజించి అర్జునునిలా భగవంతునికి శరణాగతులు కావాలి".

భక్తునకు, భగవంతునకు జయమగుగాక

-----oOo-----

# 6. విప్రవరేణ్యుడు సుదాముడు

సుదాముడు నిరుపేదబ్రాహ్మణుడు. పండితుడు. శ్రీకృష్ణుని బాల్య స్నేహితుడు. ఇద్దరు ఒకేగురువువద్ద చదువుకున్నారు. సుదాముడు వేదవిదుడు. విషయాసక్తిలేనివాడు. శాంతస్వభావుడు. జితేంద్రియుడు. శ్రీకృష్ణునికి సుదామునిమీద మంచి మక్కువ. దీనులతోనే దీనబంధువుకి మైత్రిప్రగాఢం. దీనబంధువుడనే భగవన్నామం సార్థకం కావడం అటువంటి మైత్రివల్లనే కదా! కొంతకాలానికి గురువు వద్ద చదువుపూర్తి చేసుకొని ఎవరి ఇళ్ళకువాళ్ళు వెళ్ళిపోయారు. ఎన్నో ఏళ్లు గడచిపోయాయి కాని ఒకర్నొకరు కలుసుకోలేదు. శ్రీకృష్ణభగవానుడు ద్వారకానగరానికి ప్రభువయ్యాడు. పాపం సుదాముడు పూరిగుడిసెలో నివసిస్తున్నాడు. సుదాముని భార్య కూడా అతనిలాగానే సుగుణవతి. వారింట్లో ఎప్పుడూ దరిద్రదేవత తాండవం చేస్తూ ఉండేది. అయినా ఆ దంపతులు విష్ణుభజనతో పవిత్రంగా సంతోషంగా కాలక్షేపం చేస్తూ ఉండేవారు. వారికి డబ్బుమీద ఆశే ఉండేదికాదు. అవసరాలకోసం ఎవరినీ అర్థించేవారు కాదు.

**యదృచ్ఛయోపపన్నేన వర్తమానో గృహాశ్రమీ ।**
**తస్య భార్యా కుచేలస్య క్షుత్ క్షామా చ తథావిధా ॥**
**(శ్రీమద్భాగవతం, 10/80/7)**

యాదృచ్ఛికంగా లభించిన దానితో దినములు గడుపుకునేవారు. పేదరికం మూలంగా సుదాముడు, అతని భార్య కూడా మాసిపోయిన చింకిపాతలే కట్టుకునేవారు. తినడానికి ఆహారం దొరక్క పోవడంవల్ల భర్తతో పాటు ఆ భార్య కూడా పస్తులుంటూ బాధపడేదేకాని ఎప్పుడూ భర్తను తూలనాడి ఎరుగదు.

వారి దాంపత్యం గురించి హలధరకవి హిందీలో చక్కగా వర్ణించాడు.

భర్త నిత్యం జప తప ధ్యానములు చేస్తూవుంటే భార్య అతనికి సేవ చేసేది. పళ్లో దుంపలో ఏవిదొరికితే అవే భర్తకి పెట్టి ఆయన తినగా మిగిలినవి అమృతంగా భావించి భుజించేది. నానాటికీ వారి దారిద్ర్యం భయంకరంగా విషమించిపోతుంది. అయినా అతడు ఏనాడు విచారించలేదు. భర్తతోపాటే ఆమెకూడా సంతోషంగా కష్టాలు భరిస్తూ ఉండేది. పేదరికం పెరుగుతున్న కొద్దీ, కాల్చితే బంగారం వన్నె పెరిగేటట్లు, పెరుగు చిలికితే వెన్న వచ్చేటట్లు సుదాముని భక్తిభావం కూడా ప్రబలం అవుతూ వచ్చింది. సుదాముని భార్య సీతాదేవి, పార్వతీదేవి, రతీదేవి వంటి సాధ్వీమణి. భర్తను సేవిస్తూ ఆయన పాదధూళిని సిందూరంగా ధరించేది. కష్టాలనేవి లేకుండా లోకమంతా సుఖాలే ఉంటే శ్రీహరి చరణారవిందాలయందు మనసులగ్నం కావడం మహాకష్టం.

ఆ దంపతులు అలా సాత్త్వీక జీవనం సాగిస్తున్నారు. సుదాముడు మాటిమాటికి తన బాల్యంనాటి సంగతులు చెప్పేవాడు. గురుకుల వాసంగురించి చెప్పేటప్పుడు శ్రీకృష్ణుని స్మృతిమెదిలితే చాలు ప్రేమతో పులకించిపోయేవాడు. కళ్లవెంట బొటబొట కన్నీళ్ళు కారేవి. గొంతుబొంగురుపోయేది. ఏడుపు ఆపుకోలేక పోయేవాడు. అలాగే మధ్యమధ్యలో ఆగుతూ శ్రీకృష్ణుని అద్భుతలీలలు భార్యకు వివరించేవాడు. వింటూ ఆమె కూడ మైమరచి కళ్ళనీళ్ళ పర్యంతం అయ్యేది.

ఒకసారి చాలా రోజులు వారికి తినడానికేమీ దొరకలేదు. పాపం ఆ

యిల్లాలి నోరుతడారిపోయింది. పిల్లలు ఆకలితో నకనకలాడటం చూసి ఆమెగుండె తరుక్కుపోయింది. అప్పుడామెకు ఆలోచనవచ్చింది. లోకానికే ఐశ్వర్యనిధియైన శ్రీకృష్ణపరమాత్ముడు, ఆయన చెలికాని బిడ్డలు ఆకలితో ప్రాణాలు విడవడం బాగాలేదనుకుంది. భర్తతో ఆమాటే అందామని ధైర్యంచాలక ఆగిపోయింది. పిల్లలు,"ఆకలి" ఆకలంటూ చుట్టూమూగి కాళ్ళుపట్టుకొని ఏడుస్తున్నారు. ఇకతల్లి మనసు తట్టుకోలేక పోయింది. ఆ పేదరాలు జంకుతూ భర్తతో మెల్లగా–

నను బ్రహ్మన్ భగవతః సఖా సాక్షాచ్ఛ్రియః పతిః ।
బ్రహ్మణ్యశ్చ శరణ్యశ్చ భగవాన్ సాత్వతర్షభః ॥

తముపైహి మహాభాగ సాధూనాం చ పరాయణమ్ ।
దాస్యతి ద్రవిణం భూరి సీదతే కుటుంబినే ॥

ఆస్తేఽధునా ద్వారవత్యాం భోజ వృష్ణ్యంధకేశ్వరః ।
స్మరతః పాదకమలమాత్మానమపి యశ్చతి ॥
కిం న్వర్థకామాన్ భజతో నాత్యభీష్టాన్జగద్గురుః ॥
(శ్రీమద్భాగవతం, 10–80, 5–11)

"ఓ మహాభాగా! సాక్షాత్తు లక్ష్మీనాథుడు బ్రాహ్మణప్రియుడు శరణాగతరక్షకుడు. యాదవ శ్రేష్ఠుడు అయిన శ్రీకృష్ణభగవానుడు మీమిత్రుడు. ఆయనే సజ్జనులకుగతి. మీరు పెద్దకుటుంబీకులు. పేదరికంతో బాధపడుతున్నారు. ఆయన దగ్గరకువెళ్ళండి. ఆయన తగినంతసొమ్మిచ్చి కాపాడతాడు. ఆయన భోజాంధకవృష్ణి వంశాలకు నాథుడై ద్వారకలో ఉన్నాడు. నాథా! ఆ జగద్గురువు తనచరణకమలాలను స్మరించేవారికి స్వస్వరూపాన్ని ప్రసాదించడానికి కూడా వెనుకాడడు. అటువంటి వాడు మీకు సొమ్ము ఇవ్వడంలో సందేహంలేదు. నాథా! నీకు కించిత్తు కూడా ధనకాంక్షలేదని నాకు తెలుసు. కాని ధనం లేకుండా గృహస్థ జీవనం ఎలా సాగుతుంది. అందుచేత మీరు మీ ప్రియసఖుడైన శ్రీకృష్ణుని కలవడం అవసరమని నాకనిపిస్తుంది" అని పలికెను.

"కష్టాలు భరించలేక ఈమె నన్ను ద్వారకకు పంపాలనుకుంటుంది" అని అనుకున్నాడు సుదాముడు. అతనికి మిత్రుడింటికి డబ్బుకోసం వెళ్ళడానికి మనసురాలేదు.

మేరే హియే హరికో పదపంకజ బార హజారలోం దేక పరిచ్ఛా
ఔరనకో ధన చాహియే బావరి బ్రాహ్మణకే ధన కేవల భిచ్ఛా
(నరోత్తమ కవి)

అతడు భార్యతో- "పిచ్చిదానా! డబ్బుకోసం నన్ను అక్కడికి పంపాలనుకుంటున్నావా? బ్రాహ్మణులకు డబ్బుమీద కోరిక ఉండవచ్చా? భగవద్భజనమే బ్రాహ్మణునికర్తవ్యం, ఆకలివేస్తే ఆపూటకు యాచించుకోవచ్చు" అన్నాడు. అప్పుడామె నిజమే, కాని ఇచ్చట భిక్షం దొరకడంకూడా అపురూపమై పోయింది. ఆకలితో అలమటించే పిల్లల ముఖాలు చూడండి. నాయీ చింకి గుడ్డలుచూడండి. నాకు భోగభాగ్యాలు కావాలనడంలేదు. మీరు శ్రీకృష్ణుని రాజ్యాలూ, రత్నాలూ కోరాలనడంలేదు. మనం చాలా దీనదశలో ఉన్నాం. మీరు ఒకసారి వెళ్ళి ఆయన్ని కలిసివస్తే బాగుంటుందంటున్నాను" అని పల్కింది. సుదాముడు చాలా తటపటాయించాడు. చివరికి ఈ సాకుమీద-

అయంహి పరమోలాభః ఉత్తమ శ్లోకదర్శనమ్ ।

"దుర్లభమైన శ్రీకృష్ణభగవానుని దివ్యదర్శనంలభిస్తుంది గదా!" అని అనుకొని వెళ్ళాలనే నిర్ణయించుకున్నాడు. కాని ఒట్టి చేతుల్తో ఎలా వెళ్ళేది". భార్యను పిలిచి-

"అప్యస్త్యుపాయనం కించిత్ గృహే కళ్యాణి దీయతామ్ ।"

"కళ్యాణీ! ఇంట్లో ఏమన్నా ఉంటే ఇవ్వు, ఒట్టిచేతుల్తో ఎలా వెళ్ళను?" అన్నాడు. భర్త అన్నది నిజమే. ఒట్టిచేతుల్తో ఎలా వెళ్తాడు? కాని ఆమె మాత్రం ఏం చేయగలదు. నిస్సహాయురాలు. ఆయనైతే

కృష్ణప్రేమమైకంలో ఆకలి దప్పులు ఎరుగడు కాని ఆమెకు తెలియనిది ఏముంది? ఇల్లుమొత్తం వెతికినా చిల్లిగవ్వపాటి కూడా ఏమీదొరకదు. దరిద్రుని ఇంట్లో వజ్రపుతునకలు లేనట్లే సుదాముని పూరిగుడిసెలో అన్నంమెతుకు కూడా లేదయ్యే. ఆ యిల్లాలు ఏంచేద్దామా అని ఆలోచిస్తూ ఉండిపోయింది. మొత్తానికి తెగించి పక్కింటి యిల్లాలి నడిగి నాలుగుపిడికిళ్ళ అటుకులు తెచ్చి సుదాముని చింకి పాతకండువాకు మూటగట్టింది. గణేశుని తలుచుకొని దారిలో దొరికినది భుజిస్తూ వెళ్ళిరమ్మంది.

సుదాముడా అటుకుల మూటను చంకనబెట్టుకొని బయల్దేరాడు. ఎన్నోఏళ్ల తరువాత కలుసుకోబోయే మిత్రుని తలుచుకుంటు ద్వారక చేరాడు. ద్వారక వైభవం చూచినివ్వెరబోయాడు. అతనికి శ్రీకృష్ణమందిరం ఏదోతెలియలేదు. అడిగితే ఎవరో కృష్ణమందిరాన్ని దూరంనుంచి చూపించారు. సుదాముడు ద్వారందగ్గరకు వెళ్ళాడు. ద్వారపాలకులు అడగ్గా తాను శ్రీకృష్ణుని మిత్రుడిని అన్నాడు. మిత్రుడన్న మాటవిని ద్వారపాలకులకు మతిపోయింది. ఇతడెవరో వెఱ్ఱివాడనుకున్నారు. అయినావారు భగవంతుని ద్వారపాలకులాయే. మనప్రభువు దీనబంధువు. దీనులతో మైత్రి మనప్రభువుకు సహజలక్షణమే గదా! అనుకొని సాదరంగా సుదాముని కూర్చోబెట్టారు. ఒకడు లోపలికి వెళ్ళి శ్రీకృష్ణునకు నమస్కరించి– "ప్రభూ! ఒక బ్రహ్మణుడు తలమీద పాగాలేదు. ఏ ఊరినుంచివచ్చాడో తెలియదు. పంచ, కండువా మాసిపోయి చిరిగిపోయి ఉన్నాయి. కాళ్ళకు చెప్పులు లేవు. బక్కచిక్కి ఉన్నాడు. శ్రీకృష్ణుడు దీనదయాళుడు నానేస్తం. ఆయన ఉండేదెక్కడా? నాపేరు సుదాముడు అంటున్నాడు" అని విన్నవించారు.

సుదాముడనే పేరువినగానే శ్రీకృష్ణుడు తనను తాను మరచి పోయాడు. కిరీటం అక్కడేపడిఉంది. పైనున్న పట్టుకండువా జారిపోయింది. పాదరక్షలు వేసుకోకుండా ద్వారం వైపు పరుగుపరుగున వెళ్ళి సుదాముని కాళ్ళమీద పడిపోయాడు.

అది భక్తునితో భగవంతుని సమాగమం. భక్తుడు ప్రియమిత్రునిగా భగవంతుని కలుసుకున్నాడు. ఇద్దరికళ్ళు ఒక్కటయ్యాయి. కళ్ళలో కన్నీళ్ళుగోదావరిధారలా స్రవించి భూమిని పావనంచేస్తున్నాయి. ద్వారకలో నరనారీమణులు, అంతఃపురసువాసినీ సహస్రం పేద బాపని అదృష్టాన్ని వేనోళ్ళకొనియాడుతున్నారు. దేవతలు ముగ్ధులై లీలామానుష విగ్రహుని అద్భుతలీలను తిలకిస్తూ ఉండిపోయారు. దేవేంద్రుడు దేవపారిజాతం, సుమేరువు, కుబేరుడు గడగడలాడి పోతున్నారు. శ్రీకృష్ణప్రభువు సుదామునికి తమను అర్పించివేస్తాడేమోనని వారి భయం.

ఋషులు, మునులు భక్తులు భగవంతుని భక్తవాత్సల్యానికి మురిసి పోతున్నారు. సుదాముని పగిలిన అరికాళ్లను చూసి దేవదేవుడు దుఃఖంతో బావురుమన్నాడు. సుదాముని కాళ్ళదుమ్ము కడగవలసిన అగత్యం లేకపోయింది. ప్రభువుకన్నీటి ధారలతో సుదాముని కాళ్లదుమ్ము కొట్టుకుపోయింది. భగవంతుడు సుదాముని గాఢంగా ఆలింగనం చేసుకొన్నాడు. ఎంతసేపటికి భగవంతుడు సుదాముని కౌగిలి విడువడు. చుట్టూ అసంఖ్యాకజనం మూగారు. చివరకు ఉద్ధవుడు, అక్రూరుడు భగవంతుని ప్రార్థించగా సుదాముని భుజాలను బాహువుల్లోకి తీసుకొని నడిపించుకుంటూ భగవానుడు అంతఃపురానికి వచ్చాడు.

అంధక, వృష్ణి, యాదవ వీరులకుసైతం ప్రవేశానికి నిషిద్ధమైన దివ్యసుందర మందిరంలోకి సుదాముడు వెళ్ళాడు. తనదివ్య తల్పంమీద భగవంతుడు సుదాముని కూర్చోబెట్టాడు. పూజాద్రవ్యాలు తెప్పించి త్రిలోకపూజ్యుడైన భగవానుడు సుదాముని పాదతీర్థాన్ని తలపై చల్లుకున్నాడు. అతని పాదతీర్థాన్ని త్రాగమని, తలలపైచల్లుకోమనీ, మందిరం అంతటా చల్లించమనీ భగవంతుడాజ్ఞాపించాడు. రుక్మిణీదేవి స్వర్ణ పాత్రలోని జలంతో సుదాముని పాదాలుకడిగింది. మిగిలిన రాణులు రుక్మిణీ సతిని అనుసరించారు. భగవానుడే స్వయంగా కడిగిన ఆ పాదాలను మహాలక్ష్మి ఆమె పరివారము కడగడంలో ఆశ్చర్యమేముంది?

భగవంతుడు తన ప్రియమిత్రుని ఒంటికి దివ్యవాసనలీనే చందనం

అగరు, కుంకుమలు పూసి ధూపదీపాలతో అర్చించాడు. ఆయనకు అమృతోపమానమైన భోజనం పెట్టి తాంబూలం అందించాడు. సుదాముని బక్కచిక్కిన శరీరం మురికిగా ఉంది. చిల్లుల ధోవతినుంచి అక్కడక్కడ ఒళ్ళు కనిపిస్తోంది. అయినా భగవంతుని ప్రియమిత్రుడాయె. మహాలక్ష్మీదేవి అవతారమైన రుక్మిణీదేవి స్వహస్తాలతో సఖీసమేతంగా బంగారుపిడిగల వింజామరవీచింది. శ్రీకృష్ణుడు సుదాముని చేయిచేతిలోకి తీసుకుని చిన్ననాటి ముచ్చటలు మాట్లాడటం మొదలుపెట్టారు. తమ గురుకులవాసం, గురువుగారు తమమీద చూపిన వాత్సల్యం మొదలైనవన్నీ గుర్తుచేసుకున్నారు. శ్రీకృష్ణుని కంఠస్వరం సుదాముని సమ్మోహపరచింది. అతనిలో ధనకాంక్ష ఆదిలోనేలేదు. ఒకవేళ ఏ కోశానైనా ఉంటుందనుకున్నా అది పూర్తిగా తుడిచిపెట్టుకుపోయింది. సుదాముడు–

కిమస్మాభిరనిర్వృత్తం దేవదేవ జగద్గురో ।
భగవతాత్యపకామేన యేషాం వాసో గురావ భూత్ ॥

యస్యచ్ఛందో మయం బ్రహ్మ దేహ ఆవపనం విభో ।
శ్రేయసాం తస్య గురుషు వాసోఽత్యంతవిడంబనమ్ ॥
(శ్రీమద్భాగవతం, 10–80–44–45)

"ఓ దేవాధిదేవా! జగద్గురూ! నీవు సత్యసంకల్పుడవు. సుకృతవశాన గురుకులంలో నీ సాంగత్యం లభించింది. నేను ధన్యుణ్ణయ్యాను. జగన్నాథా! నీదయవల్ల నాకే కోరికాలేదు. ప్రభూ! నీవు పరబ్రహ్మస్వరూపుడవు. దివ్యమంగళ విగ్రహుడవు. స్వామీ! లోకాచారమును పాటించడానికి మాత్రమే నీవు గురుకులవాసమూ విద్యాభ్యాసము చేశావు" అన్నాడు.

భగవానుడు ప్రియమిత్రుని వంక ప్రేమగా చూస్తూ నవ్వుతూ– "మిత్రమా! నీవు నాకేదో కానుకతెచ్చి ఉంటావు. భక్తులు ప్రేమతో ఇచ్చిన చిరుకానుకైనా నాకు మిక్కిలి మక్కువ. నేను ప్రేమలోలుడను. భక్తిలేనివాడు అశేషవస్తుజాలం అర్పించినా నాకు తృప్తి కలగదు" అన్నాడు.

పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి ।
తదహం భక్త్యుపహృతమశ్నామి ప్రయతాత్మనః ॥ *
(శ్రీమద్భాగవతం 10/81/14)

"నిష్కామి, శుద్ధ హృదయుడు ప్రేమమయుడు అయిన భక్తుడు నాకు ప్రేమతో అర్పించే పండో, పువ్వో, ఆకో, నీరో, దేన్నైనాసరే నేను ఎంతో ఇష్టంగా స్వీకరిస్తాను".

భగవానుడిలా అన్నా కూడా సుదాముడు మోమాటం వీడలేదు. రాజభోగాల, వైభవం చూచిన మీదట అటుకులు ఇవ్వడం అంటే సిగ్గేసింది. శ్రీహరికి తెలియకుండా దేన్నీ దాచలేంగదా! కృష్ణుడే మళ్ళీ "ఒదినమ్మ నాకేదో పంపే ఉంటుంది. నాకు కనబడకూడదని చంకలో మూట దాచుకుంటున్నావు. ఏమిటది?" అన్నాడు. సుదాముడు తలవంచుకున్నాడు. కాని అటుకులమూట ఇవ్వలేకపోయాడు.

సర్వభూతాత్మ దృక్ సాక్షాత్ తస్యాగమన కారణం ।
విజ్ఞాయచిన్తయన్నాయం శ్రీకామో మాభజత్పురా ॥

పత్న్యాః పతివ్రతాయాస్తు సఖా ప్రియచికీర్షయా ।
ప్రాప్తో మామస్య దాస్యామి సంపదోఽమర్త్యః దుర్లభాః ॥
(శ్రీమద్భాగవతం,10-81-6,7)

ఎల్లరి హృదయాలు ఎరిగిన శ్రీహరి సుదాముని రాకకు కారణంగ్రహించి, "ఇతడు నాసఖుడు నిష్కామభక్తుడు. ధనాపేక్షతో ఇతడు నన్నేనాడూ భజించలేదు. ఇప్పుడు ఇతని మనసులో ఏకోరికా లేదు. అందుచేతనే అటుకులు ఇవ్వడానికి సంకోచిస్తున్నాడు. అయితే ఇతడు తన యిల్లాలి కోర్కెమీద నావద్దకు బయల్దేరి రాగలిగాడు. కాబట్టే ఇతనికి దేవదుర్లభమైన భోగాల్ని, మోక్షాన్ని అనుగ్రహించాలి" అనుకొని "చంకలో

---

* శ్రీమద్భగవద్గీత 9వ అధ్యాయము 25 వ శ్లోకముకూడ ఇదియే.

ఏమిటిది?" అంటూ చింకి గుడ్డలో కట్టిన అటుకుల మూట తానే లాక్కున్నాడు. అసలేచిరిగిన గుడ్డలోకట్టినవేమో గుడ్డచిరిగి అటుకులు క్రింద పడ్డాయి. వాటిని ఏరుకుంటూ భగవానుడు– "సఖా! ఇదిచాల ఇష్టమైన కానుక. ఇవినాకూ, సర్వభువనాలకు సంతృప్తి కలిగిస్తాయి" అని గుప్పెడు అటుకులు నోట్లో పోసుకుని వాటిరుచిని మెచ్చుకున్నాడు. మళ్ళీరెండవగుప్పెడు నోట్లో వేసుకో బోతుండగా హరిచరణదాసి. అనంతలక్ష్మి రూపిణి అయిన జగజ్జనని రుక్మిణీదేవి ఆయన చేయిపట్టుకుని" ఓవిశ్వరూపా! మన్నించు నీయీ సంతోషం చాలు. మానవులు సర్వసంపదలు పొందుతారు. నీవు ఇప్పుడారగించిన ఒక్కగుప్పెడటుకులతో యీ విప్రుడికి నావైన ఇహపరసంపదలు, నావైన మోక్ష, ఐశ్వర్యాలు లభించాయి. మరోగుప్పెడు భుజించి నన్నుకూడా ఇతనికి అర్పించాలనుకుంటున్నారా?" అని అడిగింది.

అమ్మా! లక్ష్మి! భగవంతుడు నిన్ను అర్పించడు. ఆయన తనను తాను అర్పించుకుంటాడు. ఆపినా ఆగడు. భక్తులకు నీ అవసరం లేదు తల్లీ! వారు నీ నాథుని ఉపాసకులు. నీవు నీ ఇచ్ఛానుసారంగా నీ నాథుని విడువక సేవించుకున్నావు. అంతే వెంటనే భగవానుడు గుప్పెట వదలి, నవ్వి–"ఈ అటుకులంత రుచికల పదార్థం ఎప్పుడూ ఎక్కడా తినలేదు. ఎన్నోసార్లు అటుకులు తిన్నాను. కాని వీటిరుచివేరు. వ్రేపల్లెలో యశోదమ్మపెట్టిన పాలూ, వెన్నా కూడా ఇంత మధురమనిపించలేదు. మధురలో ఎన్నో భుజించాను. ద్వారకలో ఎన్నో ఉపాహారాలు ఆరగించాను. వేటికీ యీ అటుకుల రుచిలేదు" అన్నాడు.

భగవంతుడు ఆయన దేవేరులూ సేవించగా సుదాముడు అక్కడ కొద్దికాలం ఉండి, భగవానుని అనుజ్ఞ తీసుకుని బయల్దేరాడు. చాలాదూరం వరకు వచ్చి శ్రీకృష్ణుడు సాగనంపాడు. కృష్ణుడాతని కేమీయివ్వలేదు. సుదాముడూ ఏమీ అడగలేదు. అడగాలనే కోరిక అతనికి ఏకోశానాలేదు. అడగకుండానే భగవంతుడు అడిగిన దానికన్న ఎక్కువ ఇస్తాడనే ఆలోచనాలేదు. భగవంతుడికి అన్నీ తెలుసుకాబట్టి ఆయనే ఇస్తాడు లెమ్మనే ఊహకూడాలేదు. అతని మనసులో లేశమాత్రంగానైనా ఏ విధమైన

వాంఛాలేదు. మరిశ్రీకృష్ణునివద్దకు ఎందుకురావడం అంటే శ్రీకృష్ణుని దివ్యదర్శనం చేసుకోవడానికే. తన భార్యప్రోద్బలం వల్ల గదా వచ్చాననే చిన్నతనం మాత్రం అతనికి వదలలేదు. సుదాముడు ఇంటికి వస్తూలోలోన–

అహోబ్రహ్మణ్యదేవస్య దృష్టా బ్రహ్మణ్యతా మయా ।
యదరిద్రతమో లక్ష్మీమాశ్లిష్టోబిభ్రతోరసి ॥

క్వాహం దరిద్రః పాపీయాన్ క్వకృష్ణః శ్రీనికేతనః ।
బ్రహ్మబంధురితిస్మాహం బాహుభ్యాం పరిరంభితః ॥

నివాశితః ప్రియాజుష్టే పర్యంకే భ్రాతరో యధా ।
మహిష్యా వీజితః శ్రాంతో వాలవ్యజనహస్తయా ॥

శుశ్రూషయాపరమయా పాద సంవాహనాదిభిః ।
పూజితో దేవదేవేన విప్రదేవేన దేవవత్ ॥

స్వర్గాపవర్గయోః పుంసాం రసాయాం భువిసంపదాం ।
సర్వాసామపి సిద్ధీనాం మూలం తచ్చరణార్చనమ్ ॥

అధనోఽయం ధనం ప్రాప్త మాద్య నుచ్చైర్న మాం స్మరేత్ ।
ఇతి కారుణికో నూనం ధనం మే ఽభూరి నాదదాత్ ॥
(శ్రీమద్భాగవతం, 10–81–15,20)

అహో! బ్రహ్మణ్యుడైన భగవానుని బ్రహ్మణ్యత్వాన్ని చక్కగా తిలకించాను. ఆయన వక్షంమీద లక్ష్మీదేవి నివసిస్తుంది. అయినా మహాదరిద్రుణ్ణయిన నన్ను కౌగిలించుకున్నాడు. పరమదరిద్రుడనైన నేనెక్కడ? శ్రీనివాసుడైన శ్రీకృష్ణుడెక్కడ? బ్రాహ్మణుడని ఆలింగనంచేసుకొని అగ్రజునిలా నన్ను తన పర్యంకం మీద కూర్చోబెట్టుకున్నాడు. నా మార్గాయాసం పోగొట్టేందుకు సాక్షాత్ శ్రీమహాలక్ష్మి అవతారమైన రుక్మిణిదేవి స్వహస్తాలతో వింజామర వీచింది. ఇలవేల్పును కొలిచినట్లు శ్రీహరి నన్ను పూజించి నాకాళ్ళొత్తి సేవచేశాడు.

(భక్తుని మహిమ అదే. భగవంతుని అంతాపూజిస్తారు. కాని భగవంతుడు స్వహస్తాలతో సర్వమూ సమకూర్చి భక్తుని పూజించవలసి వస్తుంది) శ్రీహరి చరణాలను సేవించినంతమాత్రంచేత స్వర్గమూ, మోక్షమేకాదు, ఇహలోక సంబంధమైన సర్వసంపదలూ సర్వసిద్ధులూ ప్రాప్తిస్తాయి. భగవంతుడు పరమకృపాళువు. ఈ దరిద్రవిప్రునికి ధనమిస్తే గర్వించి తనను విస్మరిస్తాడని తలచి నాకు ధనం ఇవ్వలేదు" అని తలపోస్తున్నాడు.

ఇది భక్తుని భావన. ధనం లభించలేదని భగవంతుని నిందించేవారు ధనానికి భక్తులు. వారిదృష్టిలో భగవంతుడు ధనార్జన కొక సాధనం. జనులారా! చూడండి. మీ మనస్సులోని తెరలు వదిలించి ఒక్కసారి సుదాముని హృదయాన్ని కళ్ళారా చూడండి. ఇంట్లో తింటానికి ఒక్కగింజలేదు. ఉండడానికి సరైన కొంపకూడా లేదు. పిల్లలు మెతుకులేక అలమటిస్తున్నారు. భార్య పస్తులతోనే రోజులు వెళ్ళమారుస్తుంది. దారిద్ర్యం ఆకారంధరించి యావత్కుటుంబాన్ని తనబాహువుల్లో బంధించేసింది. అయినా అతడు భగవంతుని ఏమీ కోరలేదు. ఇల్లాలి బలవంతం మీద బయలుదేరి వచ్చినా అడగటం జరగలేదు. ఇంటిలో పిల్లల గతి ఏమిటనిగాని, భార్య కేమనిచెప్పాలనికాని కనీసం ఆలోచన కూడారాలేదు. కట్టుగుడ్డలేక పొట్టలు వెన్నుకు అంటుకుపోయిన పిల్లలతో ఆక్రోశించే యిల్లాలికి ప్రియతమ మిత్రుడు మహాప్రభువు అయిన శ్రీకృష్ణుని కలసి వచ్చానన్న సంగతి ఎలా చెప్పాలి? ఇది సాధారణ విషయంకాదు. అటువంటి పరిస్థితుల్లో మహాధైర్యవంతులు సైతం విధ్యుక్తమార్గం నుంచి చలిస్తారు. సుదాముడెంత భాగ్యశాలి. ధనానికి బదులు పరమాత్మ కారుణ్యాన్ని అనుభవించాడు. అనుక్షణం భగవంతుని కరుణను అనుభవించేమార్గమిదే. ఏ స్థితిలోనూ మనస్సు కలుషితంగాక, భగవంతుని అనుగ్రహాన్ని విధానాలను పూర్తిగా ఆనందించడం! ఇదే ఆత్మనిర్భరత. అటువంటి భక్తుని యోగక్షేమాల భారం భగవంతుడు తన భుజాలపై వేసుకుంటాడు. సుదామునికి ఏ కోరికాలేదు. అతడు నిస్పృహుడు కాని అతని భార్యాపుత్రులు ఆకలితో మరణించబోతున్నారు. భగవంతుడు అదెలా సహించగలడు? నిష్కాముడైన సుదాముని ఇల్లాలి మనస్సులో మెదిలిన కోర్కెను తీర్చడం తన బాధ్యతగా భావించాడు. భగవద్దర్శనం

అమోఘఫలదం. తద్వారా సముచిత లౌకిక అవసరాలు కూడా తీరతాయి. భగవంతుని చరణారవింద సాన్నిధ్యమూ లభిస్తుంది. ధ్రువుడు, విభీషణుడు కోర్కెతోనే భగవంతుని దర్శించారు. దర్శనంలో వారి వాసనలు నశించాయి. కాని వారి పూర్వపు కోర్కెలూ నెరవేరాయి. చివరకి అనన్యదుర్లభమైన పరమపదప్రాప్తి లభించింది. భగవద్దర్శనవిశేషమిదే. కాని కోర్కెతో మాత్రంభగవత్సాన్నిధ్యం అసాధ్యం. ఈ నిగూఢ తత్త్వాన్ని గ్రహించిన వానికి ఎట్టి స్థితిలోను కోరికలు కలుగవు. సుదామునికి ఏ కోరికాలేదు. ఆయనపత్నికి మనసులో ఒకసారి కోరికపొడసూపింది. అద్భుతలీలామయుడైన భగవానుడు విశ్వకర్మను పంపించి రాత్రికిరాత్రి సుదాముని చిల్లులగుడిసెను దివ్యసౌధంగామార్చి వేశాడు. సుదాముడు గ్రామంచేరి చూస్తే అతనికి తన ఇల్లుకనబడలేదు. తనగుడిసె ఉండవలసిన స్థానంలో సూర్యాగ్ని చంద్రతేజో విరాజితమైన దివ్యహర్మ్యాలున్నాయి. వాటి చుట్టూ ఉద్యానవనాలు వాటిలో మధురగానాలతో పరవశింపజేసే పక్షులసందోహం, వికసించిన వివిధపుష్పాల సముదాయాలు ఉన్నాయి. భవనాల్లో వివిధ దివ్యవస్త్రాభరణభూషితులై, అటూఇటూ నడయాడే యువతీ యువకులు ఉన్నారు. సుదామునికి మతిపోయింది. "నా పూరిగుడిసె ఏమయింది? ఇంత సంపన్న సౌధం ఎలా వచ్చింది? నేను కలగంటున్నానా? లేక పొరపాటున మరో నగరానికి వచ్చానా? ఇలా అనేక ప్రశ్నలు అతని మనస్సులో ఉదయించాయి".

సుదాముడు తన యింటిలోని వస్తువులను ఒకటొకటీ జ్ఞాపకంచేసుకుని పరిశీలించాడు. ఒక్కటీ కనబడదాయె. ఇవన్నీ సరే "నా యిల్లాలూ పిల్లలూ ఏరి?" సుదాముడు ఇలా పరిపరివిధాల ఆలోచిస్తూ ఉండగా దేవతలతో సమానమైన తేజశ్శాలులైన స్త్రీపురుషులు ఆనందంతో గానంచేస్తూ వచ్చి సుదామునితో సాదరంగా– "అయ్యా! ఏమిటి ఆలోచిస్తున్నారు? రండి! లోపలికిరండి. ఇది మీనగరమే" అన్నారు. భర్తరాకవిని సురుచిరవస్త్రాభరణాలంకృతమై లక్ష్మీసమాన శోభారమ్యంగా ఉన్న సుదాముని యిల్లాలు బయటికివచ్చింది. ప్రేమాతిరేకంతో ఆమె కన్నులు కన్నీటి ధారలు వర్షించాయి. ఇదంతా చూసిన సుదాముడు నిశ్చేష్టుడై సతీసహితంగా సౌధంలోకి వెళ్ళాడు. సుదామునికి అసలు

రహస్యం అర్థమయింది. ఇదంతా మహదైశ్వర్యశాలియైన శ్రీకృష్ణుని లీల. అడగకుండానే గుప్తదానంతో యాచకులమనోరథాలు ఈడేర్చే ఆప్తమిత్రుడు, నా ప్రభువు శ్రీకృష్ణ పరమాత్మయే నాసఖుడూ, ఆప్తుడూ కావాలి, ఆయనకు నేను అనన్యభక్తుడను కావాలి. నాకీ సౌఖ్యాలు వద్దు, ప్రతిజన్మలో సర్వగుణసంపన్నుడైన శ్రీకృష్ణభగవానుని యందు విశుద్ధభక్తి కావాలి. ఆయన సాంగత్య భాగ్యం కావాలి. ఆయన దయదలచి దారిద్ర్యం ఇస్తాడు. దారిద్ర్యం బదులు ధనమిస్తే ధనమదంతో మానవుడు అధఃపాతాళానికి పోతాడు. అందుచేతనే దూరదృష్టిలేని భక్తులకు భగవంతుడు వివిధ సంపదలు, రాజ్యభోగాలు ఇవ్వడు" అనుకున్నాడు.

పాఠకమహాశయులారా! ఈ మాటలు సుదామునికి మాత్రమేకాదు, మహైశ్వర్య సంపన్నులైనా మానసికంగా సర్వదా విరక్తులై ఉండే అనుభవశాలురైన పరమభక్తులకి కూడా వర్తిస్తాయి. ధనవంతులు నిరుపేదలూ కూడా ఈ మాటలను జాగ్రత్తగా అర్థంచేసుకోవాలి. ధనవంతులు ధనంలోనే సుఖముందని భావించరాదు. పేదలు ధనప్రాప్తిలో సుఖంలభిస్తుందనే అడియాస విడనాడాలి. అందరూ పరమోత్కృష్ట సంపన్నుడైన శ్రీకృష్ణపరమాత్మ యందు భక్తి తత్పరులు కావాలి.

భక్తవరేణ్యుడు సుదాముడు ప్రపంచంలో ఉంటూనే భగవద్భక్తిలో మనస్సులగ్నంచేసి క్రమక్రమంగా విషయవాసనలు పరిత్యజించి భగవద్రతిలో అహంకారాన్ని నశింపచేసుకుని చివరికి బ్రహ్మజ్ఞానులు పొందే విశుద్ధ పరబ్రహ్మపదవిని పొందాడు.

మీరుకూడా మంచి స్నేహితుడు కావాలనుకుంటే స్వార్థపరులైన ప్రాపంచిక మిత్రులను విడచిపెట్టి పరమాప్తుడైన శ్రీకృష్ణునినే మీస్నేహితునిగా చేసుకోండి. అదుగో మీతో గాఢంగా స్నేహం చేయాలని చేతులు చాపి ఎదురుగా నిలబడ్డాడు శ్రీకృష్ణపరమాత్మ. చూడండి అవకాశం జారవిడుచుకోకండి.

భక్తునకు, భగవంతునకు జయమగుగాక

-----oOo-----

# 7. ధన్యజీవి చక్రిక భిల్లుడు

బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యాః శూద్రాశ్చాన్త్యజాస్తథా ।
హరిభక్తిం ప్రపన్నా యే తే కృతార్థా న సంశయః ॥

హరేరభక్తో విప్రోఽపి విజ్ఞేయః శ్వపచాధికః ।
హరిభక్తః శ్వపాకోఽపి విజ్ఞేయో బ్రాహ్మణాధికః ॥
(పద్మపురాణం, క్రియాయోగము, 6–26)

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు, తదితరులైన అంత్యజాలు హరిభక్తి మహిమ చేత భగవదనుగ్రహం పొంది ధన్యులౌతారు. ఇదితథ్యం. భగవద్భక్తి రహితుడైన బ్రాహ్మణుడు చండాలుని కంటె అధికుడు. హరిభక్తియుతుడైన చండాలుడు బ్రాహ్మణుని కంటె అధికుడు (హరిభక్తి లేనివారికే వర్ణవ్యవస్థా సంబంధమైన ఆధిక్యన్యూనతలు వర్తిస్తాయి. హరిభక్తులు సదా సర్వాధికులు)

ద్వాపరయుగంలో ఒకానొక అడవిలో చక్రికుడనే బోయవాడుండేవాడు. వనచరుడైనా అతడు సుగుణశాలి మృదుమధుర భాషి, శాంత్యహింసాపరాయణుడు. దయాళువు, నిగర్వి. మాతాపితృభక్తుడు. అతడెన్నడు వేద శాస్త్రాలు విన్నవాడు కాడు. కాని

అతనిలో సహజసిద్ధంగా భగవద్భక్తి భావం ఉదయించింది. అనునిత్యం హరి, కేశవ, వాసుదేవ, జనార్దనాది భగవన్నామాలు స్మరిస్తూ ఉండేవాడు. అడవిలో శ్రీహరి విగ్రహం ఒకటి ఉండేది. చక్రికుడు అడవిలో చక్కని ఫలాలు దొరికితే వాటిని నోటిలో వేసుకుని రుచిచూసి అవి బాగాలేకపోతే తానుతినేసేవాడు. అవిరుచిగా ఉంటే నోట్లోంచి తీసి భగవంతుని విగ్రహానికి నివేదించేవాడు. ప్రతినిత్యం భగవంతునికి శ్రద్ధతో అలాపళ్ళు నివేదనం చేసేవాడు. అవి ఎంగిలిపళ్లనీ, వాటిని భగవంతునికి అర్పించకూడదని అతనికి ఏనాడూ అనిపించలేదు. అతడు తన జాతిసంస్కారాలను అనుసరించి సహజంగా సీదా సాదాగ బ్రతుకుతూ ఉండేవాడు.

ఒకనాడు అడవిలో తిరుగుతూ ఉండగా అతనికి ఒక పియాళ వృక్షానికి బాగా పండిన పండు వ్రేలాడుతూ కనిపించింది. చక్రికుడు దానిని కోశాడు. రుచిచూద్దామని నాలుకమీద వేసుకున్నాడు, పండు మంచిరుచిగా ఉంది. అయితే రుచిచూస్తూ ఉండగానే అది గొంతులోనికి జారిపోయింది. అతనికి చాలావిచారం కలిగింది. ఆ పండు భగవంతునికి నివేదించ దగినంత మధురంగా ఉంది. అటువంటి దానిని తినేహక్కుతనకులేదు, భగవంతునికి అత్యుత్తమమైన దానినే నివేదించాలి. అమాయకమైన అతని మనస్సుకు అంతవరకే తెలుసు. ఆ పండు గొంతుదాటి కడుపులోకి వెళ్ళిపోతుందేమోనని భయపడి కుడిచేత్తో కంఠాన్ని గట్టిగా నొక్కి పట్టుకుని మనసులో ఈ రోజు దేవునికి మధుర ఫలం సమర్పించలేకపోయానే, నాకంటె పాపాత్ముడు ఎవడుంటాడు. అనుకుని నోటిలోనికి వ్రేలుపోనిచ్చి గొంతులోనున్న పండును బయటికి లాగపోయాడు. కాని కుదరలేదు. చక్రికుడు అమాయకభక్తుడు. అలాగే భగవంతుని విగ్రహం దగ్గరకు వచ్చాడు. గొడ్డలితో గొంతుప్రక్కగా కోసి పండుబయటికి తీసి దానిని విగ్రహానికి సమర్పించాడు. గొంతునుంచి నెత్తురు వరదలా కారిపోతుంది. ఆ బాధతట్టుకోలేక చక్రికుడు స్పృహతప్పి పడిపోయాడు. కృపామయుడైన పరమాత్మ ఆ మూఢ భక్తుని పరిశుద్ధ అంతఃకరణంలోని ప్రేమకు పరవశుడై చతుర్భుజరూపియై ప్రత్యక్షమై "ఈ చక్రికునికి సాటిరాగల భక్తులెవరూ లేరు. ఇతడు తన గొంతు ఖండించుకొని నాకు ఫలాన్ని సమర్పించాడు".

యద్దత్వానృణ్యమాప్నోతి తథా వస్తు కిమస్తి మే ।

ఇతని ఋణం తీర్చుకోడానికి నా దగ్గర ఏముంది? ఈ భిల్లపుత్రుడు అత్యంత ధన్యుడు. ఇతనికి బ్రహ్మత్వ, శివత్వ, విష్ణుత్వాలను ఇచ్చినా ఇతని ఋణం తీర్చుకోలేను. అంటూ అతని శిరస్సును చేతితో నిమిరాడు. భగవంతుని కోమల కరకమల సంస్పర్శనంతో భిల్లుని బాధమటు మాయమయింది. వెంటనే లేచి కూర్చున్నాడు. భగవంతుడు వానిని లేవనెత్తి తండ్రి ఆప్యాయంగా బిడ్డ ఒంటికి అంటుకున్న దుమ్మును తుడిచే విధంగా అతని ఒళ్ళు తన పట్టువస్త్రంతో తుడుస్తున్నాడు. ఎదురుగా భగవంతుని చూచి చక్రికుడు ఆనందబాష్పాలు రాలుస్తూ గద్గదకంఠంతో–"ఓ గోవిందా! కేశవా! హరీ! జగదీశా! విష్ణూ! నిన్ను ప్రార్థించడానికి పనికివచ్చే మాటలు కూడా నాకు తెలియవు. నిన్ను పొగడాలని నా నాలుక సంబరపడిపోతుంది. స్వామీ! నాయీ అపరాధాన్ని క్షమించు. నా పాపాలు నశింపచెయ్యి. ఓ చరాచరనాయకా! చక్రధారీ! నే చేసిన స్వల్ప పూజకు మెచ్చి నీవు నన్ను అనుగ్రహించావు. మరి నిన్ను పూజించని వారు ఎంత మూఢులో కదా!" అని స్తుతించాడు.

చక్రికుని స్తుతికి భగవంతుడు సంతుష్టుడై నీ కేమివరం కావాలో కోరుకొమ్మన్నాడు. సరళ స్వభావుడైన చక్రికుడు "ఓ పరబ్రహ్మ! పరంధామా! కృపామయా! పరమాత్మా! నీవే కన్నులముందు ప్రత్యక్షమైతే ఇంకా నాకు వరాలతో పని ఏమిటి?. లక్ష్మీవల్లభా! నీకువరం అనుగ్రహించాలని ఉంటే నామనస్సు నీయందు దృఢభక్తి అచంచలంగా ఉండేటట్లు వరం ప్రసాదించు" అన్నాడు.

ఇంతకంటే భక్తులకు ఇంకేం వరం కావాలి? భగవంతుడు అత్యంత ప్రసన్నుడై తన చతుర్భుజాలతో చక్రికుని ఆలింగనం చేసుకుని దృఢభక్తి వరాన్ని అనుగ్రహించి అంతర్ధానం అయ్యాడు.

తరువాత చక్రికుడు ద్వారకకు వెళ్ళాడు. అక్కడ భగవత్కృపవల్ల జ్ఞానసంపన్నుడై దేవతలకే దుర్లభమైన మోక్ష సామ్రాజ్యాన్ని పొందాడు.

